వృత్తము లనియు, విషమవృత్తములనియు వృత్తములు మూఁడు విధములు. గణసంఖ్యయందును, గణక్రమమునందును నన్ని పాదములు సమానముగా నున్నవృత్తములు సమవృత్తములు. రెండుపాదము లొకవృత్తమునకును మఱిరెండుపాదములు వేఱొకవృత్తమునకును సంబంధించినచో నావృత్త మర్ధసమ వృత్తము. అట్టివృత్తములు రెండు నేకచ్ఛందములోఁ జేరిన యెడల స్వస్థానార్ధసమవృత్త మగును. ఒకవృత్త మొకఛంద ములోనిదియు నింకొకటి యింకొకఛందములోనిదియు నయిన పక్షమున నది పరస్థానార్ధసమవృత్తము. నాలుగుపాదములును బరస్పరభిన్నములుగా నున్నవృత్తము విషమవృత్తము. విషమ వృత్తములకుఁ గూడ స్వస్థానపరస్థానభేదము కల్పింపవచ్చునని తోఁచెడును. సమవృత్తముల సంఖ్యయే ప్రస్తారక్రమమున 134217726 అగును. అర్ధసమవిషమవృత్తములం జేర్చిన మొత్త మెంతయగునో గణితజ్ఞులు గణింతురుగాక! వృత్తము లన్నియు సంస్కృతచ్ఛందమునుండి గ్రహింపఁబడినవియే.

— జాతులు. —

మాత్రాగణములవలనఁ బుట్టినవి జాతులు. ఇందుఁ గందా దులు కొన్ని సాంస్కృతికములు. సీసాదులు దేశ్యములు. గీతా దుల కుపజాతు లనుసంజ్ఞకూడఁ గలదు. దేశ్యజాతులలో సూర్యేంద్రచంద్రగణములు మాత్రమే వచ్చును. అక్కరలు మొదలగు కొన్ని దేశ్యజాతులు కన్నడమునందును గలవు.

అల్పాక్కర, అంతరాక్కర, మధురాక్కర, మధ్యాక్కర, మహాక్కరయని యక్కర లైదు తెఱఁగులు. అల్పాక్కరకుఁ బాద

మునకు మూఁడుగణములు. తరువాతివానికిఁ గ్రమముగా నొక్కొక్క గణ మధికము. ఈయక్కరలకుఁ గన్నడములో, కిఱియక్కర, ఎడెయక్కర, నడువణక్కర, దొరెయక్కర. పిరియక్కర యనిపేళ్లు. తెలుఁగులో మధ్యాక్కర యనునది కన్నడములో దొరెయక్కరమైనది దొరెయన సమాన మని యర్థము. ఈయక్కరలో భాగమునకు రెండేసి యింద్రగణములు నొక సూర్యగణము చొప్పునఁ బ్రతిపాదమును రెండు సమానభాగములుగ విభజింపనచ్చును గాన దీనికి సమానాక్కర యను పేరును, పాదమునకైదేసి గణములుగల యక్కర గణసంఖ్యచే నైదక్కరలకు మధ్యస్థానమునునుండుటచే మధ్యాక్కర మను పేరును సన్వర్థములుగా నున్నవి.

— యతి. —

యతిపర్యాయపదములలో వడి యనునది తెలుఁగు. దాని వ్యుత్పత్తి యూహ్యము. తక్కినపదములు సంస్కృతచ్ఛందశ్శాస్త్రమునుండి గ్రహింపఁబడినవి. యతిస్వరూపవిషయములో సంస్కృతమునకును దెలుఁగునకును జాల భేద మున్నది. సంస్కృతమున యతియనఁగా విశ్రమించుస్థానము. అనఁగాఁ బద్యము చదువునపుడు గ్రుక్కవిడుచుతా వని యర్థము. పదమధ్యమున గ్రుక్కవిడుచుట కనుకూలింపదు, గావున యతిస్థానమునను బదము తెగిపోవలయును. కనుక యతియనఁ బదవిచ్ఛేదమని భావము. "యతి ర్విచ్ఛేదసంజ్ఞకః" యని వృత్తరత్నాకరము. ఈవిషయము పింగళసూత్రములలో నిట్లు చెప్పఁబడినది.

"అథాతు నామభేదేన విరమో విరతి ర్యతిః
స్వరసంధ్యాప్తసౌందర్యా త్తద్భేదేపీష్యతే క్వచిత్."

అనఁగా సాధారణముగా ధాతుమధ్యమందును ప్రాతిపదికమునడుమను విరతి యుండదు. స్వరసంధివలనఁ జెవికింపుగలుగనప్పుడొకానొకచోట నీవిధికి భిన్నముగా యతి యుండిననుండవచ్చు నని తాత్పర్యము. మహాకవుల కావ్యములలోఁగూడ నచ్చటచ్చట యతిభంగము కన్పట్టుచున్నది. ఉదాహారణము.

"మూర్ఛాదైన్యపరాంచి యస్య కలహాయంతే మిథ స్త్వాంవృణు
త్వాం వృణ్వీత్యభితోముఖాని స దశగ్రీవః కథం కథ్యతామ్."

అనర్ఘరాఘవనాటకము.

తెలుఁగులో వళియనఁగాఁ బాదాద్యక్షరమునకు సవర్ణమైన యక్షరము వచ్చుటయే. తుల్యాస్యప్రయత్నము లగువర్ణములు సవర్ణములు. సవర్ణము పదాదియందైనను రావచ్చును. పదమధ్యమందైనను రావచ్చును. పదాదియం దున్నప్పుడు పద్య మధికశ్రావ్యముగా నుండుననుటకు సందేహము లేదు. నన్నయభట్టు, బమ్మెర పోతరాజు మొదలగు కొందఱు మహాకవుల గ్రంథములలో నిట్టియతు లధికముగా నున్నవి. తిక్కనసోమయాజి కవిత్వములోఁ దఱచుగా యతి పదమధ్యమందే యుండును. మహాకవు లెందునకును సమర్థులే, కాని, సామాన్యకవులు యతిస్థానమందుఁ బదచ్ఛేదము చేయవలయునన్న ననావశ్యకశబ్దము లనేకములు ప్రయోగింపవలసివచ్చును. కవిత్వ మినుమడిక గానుండను.

"యతి కృతి కధిక శ్రావ్యం బై బెడంగుగా నిడవలయుఁ"
అని భీమన చెప్పినాఁడు. తొలుత వళియుఁ బ్రాసముఁగూడ శబ్దాలంకారములుగానే ప్రయోగింపఁబడి క్రమముగాఁ బద్యలక్షణములుగా మాఱినట్లు తోఁచుచున్నది. కన్నడమునకు యతి లేదు గాని ప్రాస మున్నది. ప్రాసమువలనఁ బద్యమునకు శోభవచ్చునని నాగవర్మ యిట్లు చెప్పెను.

క. నుతశబ్దాలంకారదొ
ళతిశయమదు కన్నడక్కె సతతం ప్రాసం
కృతకృత్య మప్పుదెల్లర
మతెదిందదు తప్పె కావ్యమేం శోభిపుదో? (ఛందోంబుధి)

తెనుఁగులోని యతివంటియతి యఱవములో నున్నదఁట. ఆ భాషలో దానికి "మోనై" యనిపేరు. కన్నడములో నేవిధమైన యతియు లేదు. కర్ణాటాంధ్రభాషల కనేకవిషయములలో నత్యంతసంబంధము కలదు. వీనికి యతివిషయములో నింత భేదమేలకలిగెనో యుభయభాషావేదులు నిర్ణయింతురుగాక.

సంస్కృతములోఁ బదియువదియగు పంక్తిచ్ఛందము మొదలుకొనియే విశ్రమము విధింపఁబడినది. మొదటి తొమ్మిది ఛందస్సులలోఁ బుట్టినవృత్తములు చిన్నవిగావునఁ బాదమధ్యమందు విశ్రమస్థాన మనావశ్యకమని గ్రహించునది. ఈమర్యాద నేయాంధ్రకవులు నవలంబించిరి. వృత్తములకు సంస్కృతములో నెచ్చట నెచ్చట విశ్రమమో తెలుఁగునఁగూడ నచ్చటనే విధింపబడినది,

గాని, కొన్నితావుల నించుకభేద మున్నది. సంస్కృతములో శిఖరిణీవృత్తమున కాఱక్షరములమీఁదను, పృథ్వీవృత్తమున కెనిమిదియక్షరములమీఁదను యతి. తెలుఁగులో వీనికిఁ బండ్రెండు, పదునొకండునక్షరములమీఁద యతి విధింపఁబడినది. ఇట్లు మఱికొన్నిస్థలములందును భేదమున్నది.

## — ప్రాసము. —

యతివలెనే ప్రాసమును మొదటఁ బద్యాలంకారముగాఁ బ్రయోగింపఁబడిన ట్లగపడుచున్నది. కాని, యది యిప్పు డఱవమందును, గన్నడమందును, దెలుఁగునందును గూడఁ బద్యలక్షణములలోఁ జేరియున్నది. అరవములో దీనికి "యదుకై" యని పేరఁట. ప్రాసమునకు వ్యంజనము ప్రధానము గాని స్వరము కాదు. యతికివలె సవర్ణాక్షరము ప్రయోగింపరాదు. కావున యతికంటెఁ బ్రాసము కవులకుఁ గష్టతరము. మొత్తముమీఁద యతిప్రాసనియమాధిక్యముచేత నితరభాషలయందు కంటెఁ దెలుఁగునఁ బద్యములు చెప్పుట కష్టతర మనుటకు సందేహములేదు. ఈకారణముచే నీనియమముల రెంటినిగూడఁ ద్యజింపవలయు నని కొందఱ కభిలాషముకలదు. యతిప్రాసలు పద్యాలంకారము లగుటయేకాక శబ్దస్వరూపము నిర్ణయించుట కత్యంతోపయోగకరములుగా నుండుటం బట్టియు, నేఁటిదనుక నాంధ్రవాఙ్మయాభివృద్ధి కీనియమములు బాధకములుగా నుండియుండక పోవుటం బట్టియు, నిప్పుడుగూడ నితరభాషలయందుకంటె నాంధ్రమందే కవితాప్రచార మధికముగా

నుండుటం బట్టియు, వృత్తనియమములఁ బాటింపశక్తిలేనివారు సీసాది జాతులలోనే పద్యము లల్లవచ్చును గనుకను, నందుకును జాలనివారు గద్యకావ్యములు రచించుట కాక్షేపములేదు గావు నను యతిప్రాసనియమము త్యజించుట కాంధ్రలోక మంగీక రించు నని తోఁపదు.

జయంతి రామయ్య.

---

# ద్వితీయముద్రణ పీఠిక.

ఈగ్రంథము తొలుత 1917 వ సంవత్సరములోఁ బ్రకటింపఁబడినది. అప్పు డచ్చుపడిన ప్రతు లన్నియు వ్యయమగుటచే నిప్పుడు తిరుగ నచ్చు వేయింపఁబడినది. ఈద్వితీయముద్రణమునందు మూలపాఠములోఁ గొన్ని చిన్నమార్పులు చేయఁబడినవి. అవి యేవి యనఁగా.—

అవతారికాపద్యములలో మొదటి పద్యము ప్రక్షిప్తములలోఁ జేర్పఁబడినది. వృత్తాధికారమందు 136 వ పద్యము తరువాత "పరస్థానార్థసమవృత్తములలో" అను శీర్షిక క్రొత్తగాఁ జేర్పఁబడినది. ఈక్రింద సూచింపఁబడు పద్యములలోఁ

జిన్న మార్పులు కొన్ని చేయంబడినవి. సంజ్ఞాధికారములో 38, 39, 72; వృత్తాధికారములో 137; జాత్యధికారములో 20.

గ్రంథకర్తృత్వమును గూర్చియు, నిర్మాణకాలమును గూర్చియుఁ గొందఱుపండితులిటీవలఁ దమతమయభిప్రాయములను బత్రికాముఖమునఁ బ్రకటించినారు. గ్రంథకర్త భీమకవి కాఁడని కొందఱును, గ్రంథము ప్రథమపీఠికలో నేను సూచించినంత ప్రాచీనము కాదని కొందఱును వ్రాసిరి. ఈ యభిప్రాయముల సమబుద్ధితో నేఁ బరిశీలించినాఁడను. కాని, నే నిదివఱలోఁ బడిన యభిప్రాయమును మార్చుకొనుటకు హేతువు లేవియుఁ గానరా లేదు. కాని కాలనిర్ణయవిషయములో బ్రహ్మశ్రీ వఝుల చినసీతారామస్వామిశాస్త్రులుగారు చెప్పిన యొకమాటకు మాత్రము సమాధానము చెప్పవలసియున్నది. మధ్యాక్కరలోని యతిస్థానవిషయము నెత్తుకొని పూర్వపీఠికలో నే నిట్లు నుడివితిని.

"మఱియు నీగ్రంథమున మధ్యాక్కరకుఁ బ్రతిపాదమునందు నాల్గవగణము మొదట యతి విధింపఁబడినది.* ఇది యాధునికమతము. నన్నయభట్టుకాలమున యతి యయిదవగణము మొదట నుండినట్లు భారతమువలన విశదమగును. తిక్కనసోమయాజికవిత్వములో మధ్యాక్కరలు నాకుఁ గనఁబడలేదు. కాని యెఱ్ఱాప్రెగడకృత మగునారణ్యపర్వశేష

* ఇది లక్ష్యమును బట్టి గ్రహింపఁదగు.

మందు యతి చతుర్థగణాదియందె యున్నది. ఈమార్పు నన్నయభట్టునకు నెఱ్ఱాప్రెగ్గడకును మధ్యకాలములోఁ గలిగి యుండవలయును. ఈ రెండు హేతువులంబట్టి భీమన నన్నయభట్టు తరువాతివాఁడును విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడును నైనట్లు తేలుచున్నది. కళింగగంగు కాలనిర్ణయము కూడ దీనికి సరిపోవుచున్నది.”

దీనిని ఖండింపఁ దలఁచిన శ్రీశాస్త్రులుగారు రక్తాక్షి సంవత్సరాషాఢమాసభారతిసంచికలో—“మహాకవుల లక్ష్యములను బట్టియే లక్షణములు చెప్పఁబడుట లక్షణశాస్త్రసంప్రదాయ మగుటంజేసి నన్నయాక్కరలకు విలక్షణముగాఁ జతుర్థగణాదిని యతిని నిల్పవలె నని చెప్పుచున్న కావ్యాలంకారచూడామణి చతుర్థగణాదిని యతిని బ్రయోగించి యున్న యెఱ్ఱాప్రెగడకుఁ దర్వాతిదె యని నొక్కి వక్కాణింపఁ దగి యున్నది. ఇట్టి స్థితిలో లక్షణశాస్త్రసంప్రదాయవిరుద్ధముగాఁ మ॥రా॥శ్రీ॥ జయంతి రామయ్యపంతులుగారు “మఱియు...” అని యిట్లు వ్రాయుట మిక్కిలి వింతగ నున్నది.”—అని వ్రాసినారు.

లక్ష్యములను బట్టి లక్షణ మేర్పడుట శాస్త్రసంప్రదాయ మనుట నిర్వివాదాంశమే. కాని మూలలక్షణమున కాధారము లయిన లక్ష్యము లేవి గ్గు యుండు ననునది మిక్కిలి జాగరూకతతోఁ బరిశీలింపవలసిన విషయము. ఏదియో యొక్కపద్యమును బట్టి లక్షణకర్తలు లక్షణ మేర్పఱిచి యుందు

రనుట సాహసము. సుప్రతిష్ఠిత మైన లక్ష్యసంప్రదాయ మేర్పడియుండినఁ గాని యది లక్షణమున కాధారము కానేరదు. ఎఱ్ఱాప్రెగడ పద్యము తప్ప వేఱుపద్యములు మన కిప్పుడు కనఁబడకుండుటచేఁ బూర్వము లేదని నిర్ణయించుట సముచితము గాదు. యుద్ధమల్లుని శాసనము దొరకకపూర్వము ప్రాచీనసంప్రదాయమునకు నన్నయభట్టారకుపద్యములే కద యాధారముగా గణింపఁబడుచుండెను?

మఱియు లక్ష్యములే మొదటిలక్షణమున కాధారము లయి యుండినను నాలక్షణము పుట్టినపిదప బయలుదేఱు లక్ష్యముల కాలక్షణమే విధాయక మగు ననుమాట యనుభవసిద్ధము. శ్రీశాస్త్రులుగారు పద్యములు చెప్పినప్పు డప్పకవ్యాది లక్షణగ్రంథముల ననుసరింతురు గాని పూర్వకవిప్రయోగముల వెదకరుగదా! ఆలాగుననే తనకాలమందుఁ బ్రచారములో నున్న లక్షణము ననుసరించియే యెఱ్ఱాప్రెగ్గడ పద్యము చెప్పె నని యేల యూహింపరాదు? శాస్త్రులుగారి యాక్షేప మనార మని నామనవి.

జ. రామయ్య.

# కవిజనాశ్రయము.

## పీఠికానుక్రమణిక.


| | |
|---|---|
| అక్కరలు | 27–28 |
| అక్షరగణములు | 24 |
| అనంతవర్మ | 19–20 |
| అప్పకవి | 5–16–17–20 |
| అప్పకవీయము | 1 |
| అప్పాలవారు | 10 |
| అర్ధసమవృత్తములు | 27 |
| ఆంధ్రశబ్దచింతామణి | 16 |
| ఆంధ్రులచరిత్ర | 8 |
| ఇంద్రగణములు | 24 |
| ఉద్ధురమాలావృత్తములు | 26 |
| ఎఱ్ఱాప్రెగ్గడ | 21 |
| కందుకూరి వీరేశలింగము పంతులు గారు (రావుబహాదరు) | 8–13–14–17–20 |
| కరీంనగరము | 8 |
| కళింగగంగు | 17–18–20–21 |
| కళింగదేశము | 15–19 |
| 'కళింగాధీశ' | 15 |
| కవిజనాశ్రయము | 1–17–21 |
| కాంచీపురము | 19 |
| కాకతీయప్రతాపరుద్రుడు | 6 |
| కాకినాడ | 7 |
| కావ్యాలంకారచూడామణి | 16·17–20 |
| కుళోత్తుంగచోళుడు | 19 |
| కొండపలకవారు | 10 |
| గణనిర్ణయము | 24 |
| గురుజాడ శ్రీరామమూర్తిగారు | 8–13–14–15–20 |
| గురులఘు నిర్ణయము | 22–23 |
| గోకర్ణుడు | 6 |
| గోదావరీమండలము | 7–8–11–13 |
| గోలకొండదేశము | 8 |
| చంద్రగణములు | 24 |
| చిలుకూరి వీరభద్రరావుగారు | 6 |
| చోడకళింగగంగదేవుడు | 19–20 |
| చోళదేశము | 19 |
| జగదేకమల్లుడు | 6 |
| జాతులవివరణము | 27–28 |
| జైనమతము | 11–22 |
| జైనవిగ్రహములు | 10 |
| తిక్కనసోమయాజి | 29 |
| 'తెలుంగాధీశ' | 14 |
| తెలుంగురాయుడు | 14 |
| దక్షవాటి | 11 |
| దాక్షారామ | 7–9 |
| నన్నయభట్టు | 13–15–16–20–21–29 |
| నామపల్లి | 8 |
| పరస్థానార్ధసమవృత్తములు | 27 |
| పింగళసూత్రములు | 28 |
| ప్రతాపరుద్రుడు | 15 |
| ప్రాసవిచారము | [illegible] |

బమ్మెర పోతరాజు 29
బ్రహ్మగణములు 26
బ్రౌనుమహాశయుఁడు 4
భీమకవి 6-7-8-9-10-13-15-16-20-21
భీమన 7-10-11-13-14-16-17-18-20-21-30
భీమనఛందస్సు 1-5
భీమరాజు 6
భీమేశ్వరుఁడు 7-9-10-11
మల్లియరేచఁడు 5
మాత్రాగణములు 24
మాత్రానిర్ణయము 23
"మోనై" 30
యతివిచారము 28-29
"యదుఘై" 31
రాఘవపాండవీయము 21
రాజరాజచోడగంగు 19
రాజనరేంద్రుఁడు (చాళుక్య) 13-19
రాజరాజు (వేములవాడరాజు) 8
రాజరాజేశ్వరుఁడు 9-10
రాజేశ్వరమాహాత్మ్యము 10
రాయకళింగగంగు 18
రుద్రగణములు 26
రేచన 6-7-11
రేచభూపాలుఁడు 6
లేమలవాడ 8
లేములవాడ 8-10
లేమ్బులవాడ 8
వర్ధమానపురము 6
వాదీంద్రచూడామణి 7
విన్నకోట పెద్దన్న 21
విమలాదిత్యుఁడు 14
విమలాధీశుఁడు 13-14
విశ్వజగతీపతి 16
విశ్వేశ్వరరాజు 17
విషమవృత్తములు 27
విష్ణుగణములు 26
వృత్తివివరణము 26-27
వెలుంగాధీశుఁడు 13-14
వెలిగందల 8-9-11-13
వేంగిదేశము 19-22
వేములవాడ 7-8-9-11
వేములవాడ భీమకవి 5-9-17-18
శ్రావకాభరణాంకుఁడు 7
సజ్జనగరము 18
సమవృత్తములు 26
సవర్ణనిర్ణయము 29
సాహిణిమారుఁడు 15-16
సులక్షణసారము 1
సూర్యగణములు 24
సోమదేవరాజీయము 15
స్వస్థానార్ధసమవృత్తములు 27
Dr. Samuel Johnson 21

శ్రీ ర స్తు.

# క వి జ నా శ్ర య ము.

---

## [1] అ వ తా రి క.

క. శ్రీకరముగ రేచనపై
లోకంబున సుకవివరులు లోలతఁ బొగడన్
బ్రాకటముగ నీఛందము
లోకం బౌ ననఁగఁ దెలుఁగులో నొనరింతున్. 1

క. వేములవాడను[2] వెలసిన
భీమేశ్వరుకరుణ గల్గుభీమసుకవి నేఁ
గోమటిరేచనమీఁదను
నీమహిఁ గవు లెన్న ఛంద మెలమి రచింతున్. 2

---

1 ఈయవతారికలోఁ జేరినపద్యము లాఱును జ-యను ప్రతిలో మాత్ర మున్నవి. 2 వేమనవాడ యని మాతృక. వేములవాడ, లేములవాడ యని వ్యావహారికనామములు. ఈగ్రామము హైదరాబాదు రాజ్యములోఁ బూర్వము వెలిగందల జిల్లా యనియు నిప్పుడు కరీంనగర్ జిల్లా యనియు వాడుక గల మండలమందు మహారాజా కిస్సెన్ ప్రసాదుగారి జాగీరులో నున్నది. అందు సుప్రసిద్ధమయిన భీమేశ్వరాలయము కలదు.

క. [1]అనవద్యకావ్యలక్షణ
మొనరంగాఁ గవిజనాశ్రయుఁడు మల్లియ[2] రే
చనసుకవి[3] కవిజనాశ్రయ
మనుఛందముఁ దెనుఁగుబాస నరుదుగఁ జెప్పెన్. 3

— ఛందఃప్రశంస. —

క. నెఱయంగా నీఛందము
తెఱఁ గెఱుఁగక కవిత చెప్పధృష్టాత్ముఁడు ద
బ్బఱచీఁకు చీఁకుగుఱ్ఱము[4]
బఱపినక్రియ నిఖిలహాస్యపదనిరతుఁ డగున్. 4

క. [5]కడుఁ గవితామహిమకుఁ దివి
రెడుకవి కిచ్చదువు[6] తెఱఁ గెఱింగినఁగా కె

---

1 ఈపద్యమునకుఁ బూర్వము దీక్రిందిపద్యములు రెండును జ — ప్రతిలోఁ గనుపడుచున్నవి. (1) పరఁగిన విమలయశోభా. సురనిరతుఁడు భీమ నాగ్రసుతుఁ డఖిలకళా, పరిణతుఁ డగమ్యను భూసుర, వరుఁడు ప్రసాదోదితప్రభువశ్రీయుతుఁ డై. (2) అసమానదానగవితన, యసమానోన్నతుఁడు నా యాచకాభరణుఁడు ప్రా, ణసమానమిత్రుఁ డీకృతి, కి సహాయుఁడు గాఁ [illegible] దాత్తకీర్తిప్రీతిన్. 2 ద — లో 'మల్లియ'కు బదులుగా నన్నిచోట్ల 'మల్లనా' యని యున్నది. 3 జ — దాను. 4 జ — లం, బరచీఁకుగుఱ్ఱమును వడి. [illegible] — న, బ్బిరనెక్కి—గుడ్డిగుఱ్ఱము. ద — చెప్పఁదివిరెడుకవి ద, బ్బఱచీఁకటిగుఱ్ఱమునన్. శబ్దరత్నాకరమందు. దిప్పరునతఁడు ద, బ్బఱచీఁకుచీఁకు గుఱ్ఱముఁ, బఱపినగతి. 5 పోల్చిచూడుఁడు. ఛందము నఱియాద కవి తెయు, [illegible] తోళలినుళివకు కవియె కురుడం, ముందెకవల్ల [illegible] మణంపదమనిడలదేంగెద్దపనో. (కర్ణాటచ్ఛందోఽంబుధి.) 6 ద — కవికిని జదువు — బ — తివిరెడువానికిఁ జదువు.

క్రూడనుండి వచ్చు పెడఁ గడ
రెడుకబ్బము సెప్ప నుగుపరిజ్ఞాన మిలన్. 5

క. అతిశయముగఁ జెప్పినన
త్కృతి కవుల కుదాత్తఫలముఁ గీర్తియుఁ జేయున్;
మతి నెఱుఁగని[1] చెప్పినదు
ష్కృతి కవుల కుదాత్తఫలముఁ గీర్తినిఁ జెఱుచున్. 6

క. అమరఁగ వేల్పులచేఁ గ
బ్బము[2] సెప్పియు కాదె నగము వడసిరి మును బా
ణమయూరాదులు, సత్కా
వ్యము సెప్పినఁ బడయరానివస్తువు గలదే[3]. 7

క. [4]కమనీయసమస్తకళా
గమములకును[5] జన్మభూమి కావ్యము, కావ్యా
గమవిదుఁడు సర్వవిదుఁ డని
సమయచతుష్టయమునందుఁ జదివిరి మొదలన్[6]. 8

క. [7]కావునఁ గవిత్వతత్త్వము
భూవలయములోనఁ దద్ద[8] పూజ్యం బని స

---

1 జ - మతివాగిఫ్రున. మఱికొన్నిప్రతులలో 'మతివగనక'. 2 జ - అమరంగా నోర్కెక కా, వ్యము. బ - అమరంగ విభులచేఁ. ద - అమరంగా నోర్కెక క, బ్బము. 3 బ - సత్కావ్యమునం బడయంగ రాని వస్తువు గలదే? 4 ఈపద్యము ట - గ - లలో లేదు. 5 ద - క్రమములకును. 6 క - సభలను. 7 ఈపద్యము ప - జ - డ - లలో మాత్ర మున్నది. 8 ప - పి - పెద్ద.

ద్భావమునఁ జెప్పఁ[1] గావ్యక
ళావేదులు పొగడఁ గావ్యలక్షణము మహిన్. 9

— కావ్యవిభాగము. —

క. హృద్యానవద్యకావ్యము
గద్యము పద్య మని చెప్పఁగా ద్వివిధ మగున్;
గద్యం బపాదపదనిక
రద్యోతితనవరసార్థరచనలఁ జెల్లున్. 10

క. నాలుగుపాదంబులచే[2]
నాలుగుప్రావళ్లు గూడినం[3] బద్యము, ప
ద్యాళియు నిరుదెఱఁగై చను
నోలిని వృత్తములు జాతు లొనరం[4] గృతులన్. 11

— పద్యవిభాగము. —

క. కమనీయ[5] వృత్తములు గణ
సమకనిబద్ధములు; శేషజాతులు మాత్రా
సమకనిబద్ధము లగు; నొ[6]
క్కమాత్ర లఘు వై ద్విమాత్రకము గురు వయ్యెన్[7]. 12

---

1 జ – దెలుపు. 2 ద – పాదంబులలో. 3 చ – గలిగినన్, ప – చెప్పినన్, ద – ప్రాపడులఁ జెప్పినన్. 4 ద – నోలిని జాతు లుప జాతు. బ – నోలిన వృత్తమును జాతియును నసఁ గృతులన్. 5 ద – గమనీయ. 6 ద – సమకనిబద్ధమ్ము లగుచు జరుగున్ దగుక, బ్బమూలంబు చెన్నఁగా నొ. 7 ద – నొ, కొక్కమాత్ర లఘు వై ద్విమాత్ర గురు వై దగదున్.

— గురులఘువివేకము. —

క. గురువులు నిడుదలు జడ్డ
క్షరముల బొట్టులపిఱుందకడ నూఁదినయ
క్షరములుఁ; బెఱనువి లఘువులు;
గురులఘువులు మూఁడుఁ గూడికొన[1] గణమయ్యెన్. 13

క. [2]నీచిత్తంబున మెత్తు స
దాచాగుల ననినఁ బిఱిఁదియవి[3] గురువు లగున్;
నీచిత్త మిగుచుఁ[4] బ్రకటన
దాచారుల ననినఁ బిఱిఁదియవి లఘువు లగున్. 14

క. [5]తరుణతరశిశిరకరసురు
చిరరేఖాకారముగను జెలువుగ వ్రాయన్[6]
గురువు; మఱి లఘువు నిశిత
స్మరశరనిభ మైనవ్రాయి[7] మల్లియరేచా! 15

— గణస్వరూపము. —

క. ఒసరఁగ మూఁడేసలను మొద
ల నడుమఁ దుదిఁ గదియఁగ గురులఘువులు నేత్రెం

---

1 చ - ట - చేర్చికొన. జ - ద - చేసికొన. 2 చ - గ - లలో లేదు. 3 ప - మెత్తుచి, తాచారుల కనిన మొదలియవి. 4 ద - మె నయం. 5 ట - జ - లలో నీపద్యము "నీచిత్తంబున" పద్యముకంటెఁ పైగా నున్నది. బ - ప్రతిలో "గురువులు నిడుదలు" పద్యముకంటెఁ పైగా నున్నది. 6 బ - రేఖాకార మగుచుఁ జెలు వలరినవ్రాల్ జ - రేఖాకార మగుచుఁ జెలు వడరినవ్రాల్. 7 ద - నిభ మగును వ్రాయ.

చిన మ భ జ స న య ర త నా
మనిరూపితగణము లయ్యె[1] మల్లియ రేచా! 16
క. [2]గురువులు మూఁ డిడ మగణము,
పరఁగంగా నాదిగురువు భగణం బయ్యెన్;
సరి మధ్యగురువు జగణము,
సరసగుణా యంత్యగురువు సగణం బయ్యెన్.[3] 17
క. [4]లఘువులు మూఁ డిడ నగణము,
లఘు వాద్యం బయ్యెనేని[5] లలి యగణ మగున్,
లఘుమధ్యం బగు రగణము,
లఘు వంత్యము[6] తగణ మయ్యె లాలితకీర్తీ! 18

---

1 డ- రతలన, మనుచుండును నీగణాళి. ఈపద్యంబునకు ముందు వెనుకల నీక్రిందిపద్యములు బ-ప్రతిలోఁ గనుపట్టుచున్నవి. (1) ద్విత్రిచతుర్గురుభసములు, ధాత్రిని రెండేసి దక్కుఁ, దక్కు నగణముల్, మిత్రేంద్రచంద్రు లనఁదగు, మాత్రాదిగణంబు మొదల మాత్ర లిడంగన్. (2) మొదల నడుమ నుదుద గురు వొదవె నేని, 'భజస' లగు నట్లు లఘువును బరఁగె నేని, 'యరత' లగు నట్లు మూఁడేసిగురువు లున్న, లఘువులున్నను మగణంబు నగణ మగును. (శ్లో. ఆదిమధ్యావసానేషు యరతా యాంతి లాఘవమ్, భజసా గౌరవం యాంతి మనౌ తు గురులాఘవౌ. అను దీనికిఁ బైపద్యము తెలుఁగు.)

2. ఈపద్యమునకు ముందు చ - ట - జ - లలో, "చంద్రవహ్ని సూర్యనత్రుఁ డౌరుద్రుని, మూఁడుకన్నులగను మూఁడుగురువు లుదయమయ్యెఁ దాన నొప్పార మగణంబు, నందు సప్తగణము లలరఁ బుట్టె" అను పద్య మున్నది. 3 జ-విరచితముగ నంత్యగురువు వినుసగణ మగున్. 4 బ-ప్రతిలో దీనికిబదులుగా, నగణంబు మూఁడులఘువులు, యగణంబున, కాది లఘువు యమతననిభా! రగణంబు మధ్యలఘు వగుఁ, దగణంబున కంత్యలఘువు దానవవినోదీ! అనియున్నది. 5 ద-లఘువాదినినుండెనేని. 6 (అయ్యె నేని, అధ్యాహార్యము).

— గణాధిదేవతలు. —

క. మ భ జ స న య ర తగణముల
కభిమతముగ భువియు శశియు నర్యమపవనుల్
ఋభునిలయ సలిలపావక
నభములు దేవతలు బుధజనస్తుత రేచా![1] 23

— గణఫలములు. —

క. శుభ సుఖ రుక్ క్షయ ధన కన
క భయైశ్వర్యములఁ జేయుఁ గ్రమమునఁ గావ్య
ప్రభులకుఁ గవులకు మొదలిడ
మ భ జ స న య ర తగణములు మల్లియరేచా! 24

క. [2]సరసాన్న రుచిరభూషణ
పరితాప స్థానచలన బహుదుఃఖ రుజా
పరమాయు రచలలక్ష్మీ
కరములు మ య ర స త జ భ నగణములు వరుసన్. 25

---

ములు రెండును గలవు. (1) చను మగణము శ్రీనాథా, యనిన ముకుందా యనంగయగణము రగణం,బన నొప్పుమాధవా యనఁ,జను నోవరదా యనంగ సగణం బగుమన్ (2) తగణము శ్రీకృష్ణయనఁగ, నగుజగణంబును మురారి యనఁగా జగతిన్, భగణము శ్రీపతి యనఁగా, నగణం బగు నృహరి యనఁగ నలినదళాక్షా! ఇందు మొదటిపద్యము అనంతుని ఛందమునందును గలదు. జైనుఁడగుకవి విష్ణుప్రతిపాదకము లగుపద్యముల రచించుట యసంభవము. కనుక యీపద్యములు ప్రక్షిప్తము లని యూహింపఁ దగును.

1 ట - నభములు నధిదైవతములు నవ్యగుణాఢ్యా! డ - నభములు న ధిపతులు రేచ! నయతత్త్వనిధీ! ద - బుధజనస్తుతచరితా! 2 ట - జ - లలో మాత్ర మున్నది.

— గణవర్ణములు. —

క. గారుత్మత గోరోచన
సారంగ పిశంగ కుముద చందన రక్తాం
భోరుహ కనకప్రభలను
నారయ మగణాది యగుగణావలి వొల్చున్.[1] 26

— గణగ్రహములు. —

క. ధరణిజ శశి రవి బుధ గురు[2]
సురరిపుగురు మంద ఫణులు సొరిదిగ్రహంబుల్
పొరి మ భ జ స న య ర త గణ
సరణికి ఛందోమతంబు చర్చింపంగన్. 27

— గణకులములు. —

క. మగణంబు శూద్రకులజము,
భగణం బగు వైశ్యజాతి, బ్రాహ్మణజాతుల్
సగణయగణములు, రగణము
జగణము నృపజాతి యంత్యజంబులు నతలున్.[3] 28

---

1 ట - జ - డాగతను మభజసనయరత గణంబులకున్. 2 ద - ఫర బుధ శశి రవి కుజ గురు. 3 క - తగణము యగణము రగణము, జగణము నృపజాతి యాంత్యజము సగణం బౌ. జ - నగణయగణములు రగణము, జగణము నృపజాతి యంత్యజంబులుసతలున్. ద - నగణ తగణములు యరలున్, జగణము నృపజాతి యాంత్యజము సగణం బౌ.

— గణగోత్రములు. —

ఆ. కాశ్య[1] పాత్రికపిలకౌశికవాసిష్ఠ
గౌతమాంగిరోజకణ్వమునుల[2]
గోత్రముల్ ప్రసిద్ధపాత్రముల్ మగణాది
నెన్నఁబడిన గణము లెనిమిదికిని.[3] 29

— గణోత్పత్తి. —

ఆ. చంద్రవహ్నిసూర్యచక్షుఁ డౌరుద్రుని
మూఁడుకన్నులందు మూఁడుఁగురూపు
లుదయ మయ్యె; దాన[4] నొప్పారె మగణంబు,
నందు సప్తగణము లమరఁ బుట్టె. 30

క. [5]భగణము సగణము నగణము
తగణంబు మరుద్గణములు తనరంగ మను
ష్యగణంబులు జయగణములు
మగణంబును రగణ మరయ మహా రాక్షసముల్. 31

— గణనక్షత్రములు. —

తే. జ్యేష్ఠమృగశిరయుత్తర చెలఁగు స్వాతి
సరవి రేవతి పూర్వాకాషాఢ కృత్తి

1 ద - కశ్య. 2 గౌతమాంగిరాఖ్యకణ్వ లనెడి - మఱియొకపాఠము గలదు. 3 ద - లన్నిటికిని. 4 ద - వాని, 5 క - ట - ద - భగణము సగణము తగణము, నగణంబును దేవగణము నరునిగణంబుల్, జగణము యగణము లయ్యెను, మగణంబును రగణ మొప్పు మఱి రాక్షసముల్.

కయును బుష్యమి యనెడునక్షత్రపంక్తి
కదియు మ భ జ స న య ర త గణములకును. 32

— గణరాసులు. —

క. అళి వృషభ సింహ తుల యుగ[1]
జలచర చాపాది కటకి[2] సంజ్ఞక రాసుల్
లలి మ భ జ స న య ర తగణ
ములకయ్యెను జగతిలోన మోహనరూపా. 33

— గణయోనులు. —

ఆ. హరిణ సర్ప వృషభ నాయురిపు కుంజర
మర్కటాఖు చాగ[3] మహిషములును
మలసి యోనులయ్యె మ భ జ స న య ర త
గణసమూహమునకు గుణగరిష్ఠ. 34

— గణగుణదోషవిచారము. —

తే. [4]మొదల సంయుక్తవర్ణంబు పొందెనేని
మఱియ రెంటికిని గ్రహమైత్రి వలయు;
నిది విచారింపనేని కృతీశ్వరుండు
పెనగు మొత్తినగతిఁ గూలు బిట్టుబిట్టు. 35

క. మగణం బెన్నడు శుభగణ
మగు, నెన్నం గ్రూరగణము మఱి జాసినదోఁ

1 వగ. 2 ప-చాపాజమకర. 3 ప-నీల. 4 ప-లో మాత్ర మున్నది.

వెగఁజంపు,[1]బుధుఁడు క్రూరం
బగుగ్రహముం గదిసి క్రూరుఁడై చనుమాడ్కిన్. 36

క. [2]మగణంబు పద్యముఖమున
సగణముతోఁ గూర్చి చెప్పఁ జనుఁ గృతి యొండెం
దగుపద్య మొండెఁ గర్తకు
యగణాంతము[3] చెప్ప శుభము లయ్యెడుఁ గొలఁదిన్. 37

క. మభనయలు పద్యముఖమున
శుభ సుఖ ధన జయము లొసఁగి సొం పొనరించుఁ;
ప్రభునాశము జతరస లవి
సభలం బద్యాది[4] నిడఁగఁ జన దెయ్యెడలన్. 38

క. నయలం జెప్పిన శుభ మగు,
జయలం జెప్పినను బతికి జయకీర్తు లగున్,
మయలం జెప్పిన సౌఖ్యము,
రయలం జెప్పినను బెంపు రయమున నిచ్చున్.[5] 39

క. పొగడొందఁ బద్యముఖమున
రగణము యగణమును గూడి రాఁగిల్లిన నీ
జగ మంతయు నేలెడువాఁ
డగుఁ గృతిపతి విభవయుక్తుఁ డగుఁ గవివరుఁడున్. 40

1 తెగిచంపు. 2 ఇది మొదలు "గాజాన కాగన్" అను పద్యము వఱకుఁ గలపద్యములు క - ద - లలో మాత్ర మున్నవి. 3 ద - యగణాం దిగఁ జెప్ప. 4 ద - బద్యాళి. 5 ద - బెట్టు రయమున నమ్చున్.

క. రసలం జెప్పినఁ జిచ్చగు,
జసలం జెప్పినను దెవులు చయ్యన వచ్చున్,
తసలం జెప్పిన మే లగు,
మసలం జెప్పినను గర్త మండల మేలున్. 41

క. మునుకొని పద్యముఖంబున
సనిలగణం బిడిన నాయురారోగ్యంబుల్
గొనసాగు, దానిముందట
ననలగణం బిడినఁ బతికి నలజడి[1] సేయున్. 42

క. తగణంబు తొలుతఁ బిమ్మట
భగణంబును గదిసి యుండఁ బద్యము హృద్యం
బుగ రచియించినఁ గర్తకు
నగణితముగ నొసఁగు[2] నాయురైశ్వర్యంబుల్. 43

క. నగణంబు గదిసి శుభకర
మగు యగణము గూడి యొసఁగు నర్థము సిరులున్;
నగణయుత మైన భగణము
జగణంబును గూడి భాగ్యచయముల నిచ్చున్. 44

క. రజతలఁగూడిన నూరక
గజిబిజి గావించుఁ, గావ్యకర్తకు సంప
ద్విజయములఁ జేయు భగణము,
నిజముగ నయరసల డాసి నిలిచినచోటన్. 45

1 ద-నలమట. 2 ద-నొదవు.

క. సభలం జెప్పిన విభవము
రభలం జెప్పినను జెట్ట[1] గయమున వచ్చున్;[2]
శుభ మగు రయలం జెప్పిన,
నుభయము వర్ధిల్లునందు రుత్తమచరితా![3]

క. రాజున కాదిఁ మగణము
నోజం గదియించి సుకవు లొసఁగెడి పద్యం
బాజులజయ మీఁ జాలదె
తేజులు నేనుఁగులు భటులుఁ దేరులు సేనల్.[4]

క. అనిలానలసంయోగం
బనుపమకీలాకరాళ మగువహ్నిభయం
బొనరించుఁ గర్త[5] గృహమున
కను[6]మానము లేదు దీననండ్రు కవీంద్రుల్.[7]

క. తగణంబు గదిసి చంపును,
రగణము దా భీకరంపు రణ మొనరించున్,
సగణం బిఁక నొక చిత్రము
మగణముతోఁ గూడఁ గాలమానము పతికిన్.

క. * అగినిగణంబున కిరుదెస[8]
నగణముతోఁ గూర్చి చెప్ప[9] నత్కవి మదిలో

1 ద - చెటు. 2 నిచ్చున్, పాఠాంతరము. 3 ప - గ
4 ద - నేలన్. 5 ద - గర్తృ. 6 ద - నను. 7 ప - కనుమా
లేదు దీనినంటకు రేచా! * ఇందు, అగ్ని, భగ్నశబ్దములకు, అగిని
నము ననుతద్భవములు కనుపడుచున్నవి. 8 ద - గడ. 9 ద - చెు

సగి[1] దైనఁ దిట్టి దైనను[2]
బగనము గాకుండఁ గమలభవుఁడో శివుఁడో? 50

క. ఏగణముఁ గదిసె నగణం
బాగణము సమస్తముగఁ గళావాప్తం బై[3]
రాగిల్లు నినుము పరుసపు[4]
యోగంబునఁ బసిఁడివన్నె నూసనకరణిన్. 51

— అక్షరగుణదోషవిచారము. —

క. [5]శ్రీకారము గలపద్యము
ప్రాకటముగ లచ్చి యొసఁగి పతి కనవరతా
స్తోకజయము లొనగూర్చును
మాకరుణారక్షితాంగ మల్లియరేచా! 52

క. [6]షాఘాబాభామాలను
పాపాక్షరసంజ్ఞ లేనుఁ బద్యము మొదలన్
రూపించి నిలిపి చెప్పిన
నాపద్దశలకును మూల మండ్రు కవీంద్రుల్. 53

1 ద-ఁడగి. 2 చెప్పిన. 3 క – ద – బాగుగ యగణము గదిసిన, నాగణము సమస్తముంగళావాప్తం బై. 4 ద – పరుసము. 5 ప – లో మాత్ర మున్నది. 6 మొదటిపాదములోని వ్యంజనములవి ద్విత్వముగను ఉచ్చారణసౌకర్యార్థమని యుండునది. ఇట్టి యుచ్చారణము లోకవ్యవహారమునందును గలదు. ఈపద్యమునందు, షఘలకుఁ బ్రాసము విధింపఁబడినది.

— గణలింగములు. —

క. [1]ఇలఁ దగణ రగణ జగణం
బులు పురుషగణములు, భగణమును యగణంబున్
లలనాగణములు, నగణము
పొలుచు మగణ సగణములు నపుంసకగణముల్. 54

— అక్షరనిర్ణయము. —

క. [2]ఆదులు పదియే నసఁగాఁ
గాదులు దా మిరువదేను గణుతింపంగా
యాదులు పది యని చనఁగా
నీదెస నక్షరము లమరు నేఁబది యనఁగన్. 55

---

1 గ - లో మాత్ర మున్నది.
ప - మగణము నగణముఁ బురుషులు
జగణరగణసగణముల్ నిజంబుగ నింతుల్
యగణము తగణము భగణము
నగును నపుంసకము లుత్తమాదిఫలంబుల్.

2 గ—ఆదులు పదియా అనఁగాఁ, గాదులు తా మిఱువదేను (గాఁగన్) బరఁగున్, యాదులు తొమ్మిది యనఁగా, నీదెస నక్షరము లమరు నేఁబ.. యనఁగన్. అం, అః, అనుస్వారములకు రుద్రుఁ డధిదేవత. సమదైవత్వము కలదు గనుక అః అను విసర్గాక్షరమును విడిచిన ఆదులు ౧౫, కాదులు ౨౫, కకార, షకార సంయుక్తం బయి భిన్నదైవత్వంబును ప్రత్యేకఫలదంబు నగుటం జేసి క్షతోఁగూడ యాదులు ౧౦. అంతు ౫౦ అక్షరములు.

— వళ్లు. —

క. [1]విశ్రాంతి విరతి విశ్రమ
విశ్రామ విరామ విరమ విరమణ లనఁగా
విశ్రుత మగు యతి కృతి కధి
కశ్రావ్యం బై బెడంగు గా నిడవలయున్. 60

క. [2]చరణాద్యక్షరమే వడి
చరణంబుద్వితీయవర్ణసమితియె ప్రాసం
బరయఁగఁబ్రాసం బొక్కటి
చరణంబుల వళ్లు వేఱె జగతిం జెల్లున్. 61

---

నన్. చ - మొదలం బద్యాది నొందించినన్. ఈపాఠంబు సమంజసముగా లేదు. ఈపద్యమునకుఁ దరువాత, ప - జ - ల లో :— "వరఁగఁగ అ ఆ ఐలును, వరుసఁగ చ ట తపయవలు క్రమసంబుగఁ బడియుండ్, గగఁ బవనబీజములు గో, వరవాహన దహన వసుధ వన నభము లగున్." అను పద్య మున్నది. ప-లో నీపద్యమునకుఁ బిదప "ఇది శ్రీకవిజనాశ్రయచ్ఛందంబునందు సంజ్ఞాధికారము సంపూర్ణము. ఇఁక వళ్లు" అని యున్నది. మఱియు జ-లో నీస్థలమున నక్షరఫలములఁ గూర్చిన పద్యములు కలవు.

1 చ - డ లలో నున్నది. క-ద-ప్రతులలో—గీ. విరతి విశ్రమ విశ్రాంతి విరమ విరమ, ణాభిధాన విరామము లనెడి పేళ్లు, యతికిఁ బర్యాయ పదములై యమరుఁ గృతిని, యుక్తపదములఁ గృశులయం దునుపవలయు.— అనియు, ప - ప్రతిలో—గీ. విరతి విశ్రమ విశ్రాంతి విరమణాయతు, లనఁగఁ బర్యాయ శబ్దంబు లగుచు నుండు, యతుల కొప్పుగ నక్షర తతుల నెల్లఁ, గృతుల నిలుపఁగ రేచన కీర్తి గలుగు.—అనియు నున్నది. 2 క-ప-గ-ల-లో నున్నది. చ - డ - ప్రతులలో, క. విలసత్పాదాద్యక్షర, ములు వళ్లగు నాద్వితీయములు ప్రావళ్లు, న్నెలకొని తమ తమ పాదం, బుల యతిపై నన్ని పాదములఁ బ్రాలమరున్. అని యున్నది.

— యతిభేదములు. —

క. ¹స్వరవర్గాఖండప్రా
ద్యరుబిందుప్లుతములుఁ బ్రయుక్తాక్షరముల్
²పరఁగఁగ నెక్కటి పోలిక
³సరసలు నాఁ బదివిధములఁ జను వళ్లు మహిన్. 62

— స్వరయతులు. —

క. ⁴అఆ హైఔలకు మఱి
ఇఈలు ఋకారసహితము లెఏలకు నో
⁵ఉఊ ౡములతో నోపఁబడి
ఒఓలకు వళ్ళగు స్వయోన్నతచరితా! 63

క. ⁶స్వరగణము కకారాద్య
క్షరములతో సంధి చేసి కదియించినఁ ద
త్స్వరము కొని చెప్పనది వ
ళ్ళగ నిందజనస్తుత కవిజనాశ్రయ కృతులన్. 64

---

1 క–ప–డ–లలో నున్నది. 2 బరుసడి. 3 మ–సరసమనన్ బ–సరసలు నాఁ బదియగు వళ్లు చను నిర్ధారిత. వ. స్వరయతి, వర్గయతి, అఖండయతి, ప్రాది బిందు ప్లుతములు, ప్రయుక్తాక్షరయతి, ఎక్కటి, పోలిక, సరసయతి, ఈపది యును యతుల పేళ్లు. 4 క–మ–డ–ద–లలో నున్నది–ఈపద్యంబున–అ ఆ–ఇ ఈ–ఉ ఊ–ఎ ఏ–ఒ ఓ–అనువాట్ల ద్వితీయాక్షరములు ద్విత్వాక్షరములవలె నుచ్చరింపఁబడును గాన వానిముందున్న హ్రస్వాక్షరములు గురువులుగాఁ బ్రయోగింపఁబడిన వని యూహించునది. మఱియు నిందుఁ గేవలస్వరములకుఁ బ్రాసము విధించుట విశేషము. 5 ద–ను ఊలోపఁబడితములో. 6 క–మ–డ–లలో నున్నది.

— బిందుయతి. —

క. [1]కచటతప లనఁగఁ బరఁగిన
ప్రచురం బగు నేనువర్గపంక్తుల పిఱుఁదన్
రుచిరము గ బిందు వ్రాఁదిన
సచలం బై వళ్లు చెల్లు నంత్యాక్షరముల్. 68

గీ. ఙాకు వడి చెల్లు రత్నకంకణ మనంగ
ఞాకు వడి చెల్లు బర్హిపింఛం బనంగ
ణాకు వడి చెల్లుఁ గనకమండప మనంగ
నాకు వడి చెల్లు దివ్యగంధం బనంగ
మాకు వడి చెల్లు విజితశంబరుఁ[2]డనంగ. 69

— ప్లుతయతి. —

క. [3]దూరాహ్వానమునందు మ
హారోదనగానసంశయార్థములతుదన్[4]
[5]జేరువఁ దగ నాద్యచ్చుల
[6]నారూఢిగఁ బ్లుతమువడి మహాత్మ్యము మీఱున్. 70

---

1 బ-దీనికి బదులుగా, క. పంచకవర్గాక్షరములు, పంచమవర్ణములఁ గూడి వరఁగఁగ నిలుచున్, వంచింపఁగఁ బెఱనాలుగు, నంచితముగఁ బిఱుఁద నున్నలంటిన చోటన్. 2 ప-దివిజవంశం బనంగ. 3 ద-లో నీపద్యమునకు ముందు, క. ప్లుత మనఁబరఁగుఁ ద్రిమాత్రా, న్వితవర్ణము దానిమీఁద వితతస్వరముల్, కృతిపై యక్షరమునఁ జనుఁ, జతురాననచతుర (యతులు) వళ్లు చక్కటిఁ జెల్లున్. అను పద్య మున్నది. 4 ద-ములు తుదిన్. 5 ద-జేరువతో 6 ద-తో రూఢిన్ బ్లుతమువడి యొదుర్కొని నిలుచున్ ప-లో నీపద్యమునకు లక్ష్యముగా 'విజనకాత్మజన్' అను భాస్కరరామాయణపద్య ముదాహరింపఁబడినది.

— సంయుక్తాక్షరయతి. —

క. [1]వరకృతులను సంయుక్తా
క్షరములలో నెద్ది యైనఁ జను వడి యిడఁగా
గురుబుధజనవరదాయక
స్మరసన్నిభసుభగమూర్తి మల్లియరేచా ! 71

— ఎక్కటివడి. —

క. ధరజఞ లను నీరెండ
క్షరములు విన్నయది లేదు శబ్దము మొదలన్
[2]మరఅలవము లను నేన
క్షరములు తమతమకె వళ్లు కమలాధీశా ! 72

— పోలికవడి. —

క. పోలఁగ, పుపుబుభులకు మూ
పోలికవడి శీల ముల్లమున కెన యనఁగా[3]
శీలం బుల్లం బనఁ గా
భూలోకం బమరలోక[4]మున కెన యనఁగన్. 73

---

1 ద-క. వెలయఁగ సంయుక్తాక్షర, ములలో నెద్ది యయిన జనునను మునుకొని వడిగా, నిలుపం దగుఁ బాదంబుల, నలఘుపరాక్రముఁడ రేచ యసదృశవిభవా. గీ. పాదముల నాది జడ్డ లైపరఁగుచున్న, వళ్లరెండక్షరంబుల వలసినదియు, నిలుపఁదగు వళ్లపట్టున నిశ్చలాత్మ, బుధజనప్రియ కవిరాజభూషణాంక. 2 ద-యరమరవలవదు. బ-మరవన లను నీయే నక్కాగ. 3 ద-మునమెత్తు రనన్.

— సరసయతి. —

క. ¹అయహాలు చఛజఝశషసలు
సయసంయుతి వణలు² రేచనా సరసగుణ
ప్రియ యుతి యొుండొంటికి ని
శ్చయము గ నల్లయ్య సర్వశాస్త్రవిధిజ్ఞా. 74

— సంఖ్యావాచకపదములు. —

క. ౧ ³హిమకర ౨ కర ౩ వైశ్వానర
౪ సముద్ర ౫ బాణ ౬ ఋతు ౭ ముని ౮ భుజంగమ ౯ నందా
ద్యమితగణితోక్తసంజ్ఞా
క్రమములుగాఁగ వలయు నెన్నఁగాఁ దగు నెడలన్. 75

1 చ-ఛ-లలో మాత్ర మున్నది. 2 వ-నయసన్నుతవళ్లు. ఈపైని వివరింపఁబడిన యతులు గాక-క-లో (1) అఖండయతి. (2) వృద్ధియతి. (3) అభేదయతి యను మూఁడును -చ- లో నివిగాక. (4) నిత్యసమాస యతి. (5) కాకుస్వరయతి. (6) భాగవర్గయతి. (7) ప్రాసయతి యను నీయేడుయతులు నధికముగా వివరింపఁబడినవి-ఇవి ప్రక్షిప్తములని తోఁచుచుం గునది. మఱియును, పదియేనుయతుల లక్ష్యములను జెప్పుచు రామస్తుతిగా నున్న భీమనవాటు వని కవిజీవితములో నీ క్రిందిపద్యము కనఁబడుచున్నది. సీ. అబ్జగర్భునిని 'స్వరా' ద్భుతావ్యయపదాబ్జ కమలాక్ష మాని 'వర్గ' ప్రసన్న, వైరి 'వాయిగుంఫి' దేవాదిదేవ కృపాంబుధి యఖిలదిక్పాలక 'ప్రాది' నిలయ. నుత పుణ్యచరిత 'బింబ' యుతానవాంభోజ యతిప్రభూ 'ప్లుత' నిజాత్మ మహా తత్త్వ, స్వచ్ఛపాదభక్తి 'సంయుక్త' సంచార మహిమ 'నెక్కటి' యైన మాన్యచరిత. గీ. పోల్పని 'పోలిక'ప దైవములు న గలరె, 'సరస' నుతిపాత్ర భక్తగంజన చరిత్ర, 'ప్రాస' నిర్భిన్న చండితదానవేంద్ర, యలఘు యతిగణ్య రఘురామ యాగవిరామ. 3 క-డ-లలో మాత్ర మున్నది.

## — ప్రాసములు. —

క. భాసురము లగుచు సుకర
ప్రాసానుప్రాసదుష్కరప్రాసాంత్య
ప్రాసద్విప్రాసత్రి
ప్రాసము లన షడ్విధములఁ బరఁగును [1]కృతులన్. 76

వ. అందు సుకరప్రాసం బన్నది సులభాక్షరములు ప్రాసం బిడి చెప్పునది.[2] 77

క. పర మోపకార ధరణీ
సురవరసురభూజ [3]సుగుణసుందర తరుణీ
స్మరనిభ సుకరప్రాసం
బరుదుగఁ గృతులందు నొప్పు నభినుతచరితా ! 78

వ. దుష్కరప్రాసం బన్నది విషమాక్షరంబులు ప్రాసం బిడి చెప్పునది. 79

క. స్వఃకాంతాసమ యోషిదు
రఃకృతరతిచిహ్న దుష్కరప్రాసం బా
విఃకృత మగు నిట్లు సుపు
త్రః కులదీపక యనంగఁ దగుచు మహాత్మా! 80

వ. మఱి ద్విప్రాసం బన రెండక్షరంబులు ప్రాసం బిడి చెప్పునది.

క. దోసంబు లేక వస్తు ని
వాసం బై వెలయఁ జెప్పవలయును ద్వంద్వ

---

1 ప-రేచా. 2 ఈ వచనము ద-లో లేదు. 3 ద-వణిజ.

ప్రాసం బుచితాక్షరవి
న్యాసంబుగఁ గృతుల రేచ నయ[1]తత్త్వనిధీ. 82

వ. మఱి త్రిప్రాసం బన మూఁడక్షరములు ప్రాసం బిడి చెప్పునది. 83

క. దానమున సత్యమున నభి
మానమునం బోల్ప నీసమానము ధరణిం
గాన మనం ద్విప్రాసము
[2]చాన మనోహార మగును బుధస్తుతచరితా! 84

వ. మఱి యనుప్రాసం బన్నది ప్రాసాక్షరంబు పెక్కెడల నిడి చెప్పునది. 85

క. మిత్రస్తోమపవిత్రచ
[3]రిత్ర జితత్రిదశవర ధరిత్రీసుతన
క్షత్రాంబుజమిత్రగుణా
సూత్ర యనుప్రాస మిదియ మల్లియరేచా! 86

వ. మఱి యంత్యప్రాసం బన్నది మొదటిపాదము కడపటి యక్షరంబు నాలుగుపాదంబుల కడపట నిడి చెప్పునది. 87

క. జననుత భీమతనూజా!
సునయార్చితవిభవ[4]తేజ సుభగమనోజా!

---

1 ద-నయవినయా. 2 దానమునో హారమగు. 3 ద-రిత్ర త్రిదశవగపగ ధరిత్రీసుతస. 4 ద-విభవ రేచ.

వినుతవిశిష్టసమాజా !
యన నంత్యప్రాస మగు[1] నహర్పతితేజా ![2] 88

వ. మఱియుఁ బ్రాసాక్షరలక్షణవిశేషం బెట్టి దనినఁ ?[3] 89

క. వలసినచో లళములు డళ
[4]ములు మఱి బుక్రాంతవర్ణములు ప్రాసము లై
యలవడు సత్కవికృతులన్
నిలుపం దగు వానిఁ దెలిసి నియతప్రీతిన్. 90

క. తాళము దాలము నాఁ జనుఁ
జోళుఁడు చోడుండు నాఁగ సొం పగుఁ గృతులన్
వ్యాళము వ్యాలము వ్యాడము
నోలిని సమరూఢిఁ బ్రాసయుక్తము లయ్యెన్. 91

గీ. భీకరాకారుఁ డయ్యు నభీకృతుండు
మేదురక్రోధి యయ్యు ననాదృతుండు
[5]పావనాత్మకుఁ [6]డయ్యు ఖలావృతుండు
నాఁగఁ బ్రాసములకు సమానంబు లెపుడు. 92

---

1 ద-ప్రాస మిది యహా. 2 ఇంతవఱకుఁ బ్రాసములను గూర్చిన పద్యములు క-డ-ద-బ-లలో మాత్ర మున్నవి. 3 ఈవచనము దీనిపిదప వచ్చుపద్యములు మూఁడును క-డ-ద-లలో మాత్ర మున్నవి. ఈపద్యములు విన్నకోట పెద్దన్న కావ్యాలంకారచూడామణియందుఁ గూడ గన్పట్టు చున్నవి. కావున నిందుఁ బ్రక్షిప్తము లైనవేమో యని సంశయింపఁదగి యున్నది. 4 ద-ములు మఱియును నిట్టివర్ణములు. 5 ద-పావకా. 6 ద-డయ్యనలా.

[1]గద్యము. ఇది[2] వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవిజనాశ్రయం బన ఛందంబునందు సంజ్ఞాధికారము.[3]

---

1 వ-ఇతి. 2 ద-వాగీంద్ర. 3 వ-ఇతి, కవిజనాశ్రయ చ్ఛందంబు నందు యతిచ్ఛందోఽధికారము సంపూర్ణము. డ-లో, సంజ్ఞాధికారము నకు బదులుగా యతిచ్ఛందోఽధికార మని యున్నది. బ-లో, ప్రథమాశ్వాస మని యున్నది.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము

## [1]వృత్తాధికారము.

---

### — సమవృత్తములు —

క. [2]పరమాత్మముఖారుణసర
సిరుహావినిర్గతసమస్తసిద్ధాక్షరపం
క్తి రసావహమ్మృదుపదసుం
దరతరకృతిరచన లీవుతను దయ మాకున్. 1

క. [3]సమవృత్తములం జతుష్పా
దములం దొక్కక్షరము మొదలుగా నెక్కన్
గ్రమమున గణాక్షరంబులు
సమాన మై యిరువదాఱు ఛందములందున్. 2

---

1 వ-వియతిచ్ఛందో౽ధికారము. ఈ యధికారమునను, క-వ-హ-మ-లు మాత్రుకలు. 2 మ-ద-లలో మాత్ర మున్నది. 3 క. సమవృత్తములం జతుష్పా, దముల నొకక్షరము మొదలు తెలుపంగ నెక్కన్, గ్రమగణిత వృత్తములకును, సమమై చను నిరువదాఱు ఛందములందున్.

వ. [1]అవి యెవ్వి యనిన.—ఉక్త, అత్యుక్త, [2]మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, [3]ఉష్ణిక్, అనుష్టుప్, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, [4]సంకృతి, అభికృతి, [5]ఉత్కృతి, యన నిట్లు సమవృత్తంబులను నుత్తమరత్నంబులు పుట్టు నాకరం బైనసాగరవేలయుం బోలె నొప్పుచున్న యీయిరువదాఱు ఛందంబుల పేళ్లు వేఱు వేఱ వివరించెద. 3

క. [6]వృత్తములకుఁ దగు పేళ్లను
వృత్తగణాక్షరము లెడల విశ్రమములు నా[7]
వృత్తార్థమునను చెప్పెదు
వృత్తసమూహంబు కృతుల వెలయుచు నుండన్. 4

వ. [8]ఉక్తాచ్ఛందంబునకు నొక్కక్షరంబు పాదంబుగా రెండువృత్తంబులు పుట్టె నందు,

శ్రీయనువృత్తము.—శ్రీ
శ్రీ
జే
యున్. 5

---

1 పు-అ రెట్టివి ? 2 పు-ద-మధ్యము. 3 ఉష్ణిహా. 4 పు-సంకృతి. 5 పు-ప-న్యుత్కృతి. 6 ఈపద్యము-క-పు-ద-లలో స్థానాంతరముల నున్నది. 7 పు-విశ్రామములున్, వృత్తార్థములం జెప్పెను. 8 ప-లో లేదు.

వ. అత్యుక్తాఛందంబునకు రెం డక్షరములఁ
లుగువృత్తంబులు పుట్టె. అందు,

[1]శ్రీపెంపువృత్తము.—శ్రీపెం
పోఫుస్
బ్రాపున్
గాపున్.

వ. మధ్యాఛందంబునకు మూఁ డక్షరం
బెనిమిదివృత్తములు పుట్టె. అందు,

వినయవృత్తము.— వినయం
బునయం
బునయ
జ్ఞునకున్.

[2]మృగీవృత్తము.—
విన్మృగే
ఫన్మృగీ
మున్మృగాఁ
జిన్మయా.

[3]నారీవృత్తము.—
నారీవృ
త్తారంభం
బాఘన్నా
కారంబై.

1 ద—మధ్యమా. 2–3 బ—లో నున్నవి.

వ. ప్రతిష్ఠాచ్ఛందంబునకు నాలుగక్షరంబులు పాదంబుగాఁ బదునాఱువృత్తంబులు పుట్టె. అందు,

బింబవృత్తము.— పంబి భకా
రంబుగకా
రంబునుగా
బింబ మగున్. 10

సుకాంతివృత్తము —
జకారమున్
గకారమున్
సుకాంతి కో
ప్పుకుంచునే. 11

[1]కన్యావృత్తము.—పొత్తిగాగా
వత్తిం గన్యా
వృత్తం బయ్యెన్
జిత్తం బారన్. 12

వ. సుప్రతిష్ఠాచ్ఛందంబున నైదక్షరంబులు పాదంబుగా ముప్పది రెండువృత్తంబులు పుట్టె. అందు,

సుందరీవృత్తము.—చెంది భకారం
బొంద గగంబుల్
సుందరి యన్నే
రందురు సూరుల్. 13

1 బ—లో నున్నది.

ప్రగుణవృత్తము.—

సగణం బొందన్
గగముం జెందన్
బ్రగుణం బన్నే
రగు నీధాత్రిన్. 14

అంబుజవృత్తము.—

ఇంబుల భకా
రంబును లగం[1]
బుం బొనరఁగా
నంబుజ మగున్.[2] 15

వ. గాయత్రీఛందంబునకు నాఱక్షరంబులు పాదంబుగా నఱువది నాలుగువృత్తంబులు పుట్టె. అందు,

విచిత్రవృత్తము.—యయంబుల్ విచిత్రా
హ్వాయం బయ్యె ధాత్రిన్. 16

తనుమధ్యావృత్తము.—

[3]చంచత్త్రయము ల్పా
పించుం దనుమధ్యన్. 17

---

1 ద-బుం బొరయఁగా. 2 ఈపద్యము తరువాత క-షె-ద-లలోఁ ఇది వాదీంద్ర...విరచితం బైన కవిజనాశ్రయం బనుఛందంబునందు యతిచ్ఛందోఽధికారము, అనుగద్యమును దరువాత, క. ఛందోదేవత బుధజన, వందిత గాయత్రి మధురవచనామృతని, వ్యందంబు మమ్ము ఖేందువు, నం దొందించు నది గాత మానందముగాన్. అను పద్యము నున్నవి. 3 ప-లో లేదు. ద-లో-ఎంచం దయము ల్పావి.

[1]సురలతావృత్తము.—సరసగ నయంబుల్
సురలత కొప్పున్. 18

[2]వసుమతీవృత్తము —అందంబుగఁ దసల్
పొందున్ వసుమతిన్. 19

వ. ఉష్ణిక్ఛందంబునకు నేడక్షరంబులు పాదంబుగా ౧౨౮ వృత్తంబులు పుట్టు. అందు,

విభూతివృత్తము.— శ్రీఘలా విభూతికిన్
రేఫపై జగం బగున్. 20

మదనవిలసితావృత్తము.—
మదనవిలసితం
బుదిత [3]ననగముల్. 21

కుమారలలితావృత్తము[4].—
కుమారలలిత కం
దమారు జసగముల్. 22

సురుచిరావృత్తము.— భాసుర భసగల్ రే
చా సురుచిర మయ్యెన్. 23

[5]మదరేఖావృత్తము —
కోపొందన్ మసగంబుల్
ప్రాపించున్ మదరేఖన్. 24

1 ప-లో లేదు. 2 బ-లో నున్నది. 3 పా-బదిరయు ననగముల్. 4 ప-కుమారవిలసితము. కుమారవిలసితం, బుమాప జసగలన్. 5 బ-లో నున్నది.

వ. అనుష్టుప్ఛందంబున కెనిమిదియక్షరంబులు పాదంబుగా ౨౫౬ వృత్తములు పుట్టె. అందు,

విద్యున్మాలావృత్తము.—

ఉద్యన్మాగాయుక్తం బైనన్
విద్యున్మాలావృత్తం బయ్యెన్. 25

చిత్రపదవృత్తము.— సద్విధిఁ జిత్రపదం బౌ
భద్వయగద్వయ ముప్పన్. 26

మాణవకవృత్తము.—

మాణవకాఖ్యం బగు న
క్షీణ భతంబు ల్లగముల్. 27

ప్రమాణీవృత్తము.— అగున్ జకార రేఫలున్
లగంబునుం బ్రమాణికిన్. 28

సమానీవృత్తము.— ఇంబుగా రజంబు వకా
[1]రంబు గా సమాని యగున్. 29

సింహరేఖావృత్తము.—

[2]శ్రీ రజంబుపై గగంబుల్
చేర సింహరేఖ యయ్యెన్. 30

వ. బృహతీఛందంబునకుఁ దొమ్మిది యక్షరంబులు పాదంబుగా ౫౧౨ వృత్తంబులు పుట్టె. అందు,

భుజగశిశురుతవృత్తము.—

భుజగశిశుగుత మగుఁ బె
న్నిజముగ ననయముల్ గాన్. 31

---

1 ద-రంబునున్ సమాని కగున్. 2 ద-వేరజంబుపై గగంబుల్.

హాలముఖీవృత్తము.—

ద్విజతోపమ హాలముఖీ
వృత్త మగున్యను రనసలన్. 32

ఉత్సుకవృత్తము —

సుందర సై భభరంబు లిం
పొందిన నుత్సుక సై చనున్. 33

భద్రకవృత్తము.—

స్థిరమతోఘ రసరంబులన్
భద్రకం బగు ధరిత్రిసై.[1] 34

— యతినామము. —

[2]క. వెలయఁగ నిలఁబట్టి వల్లిక
వలయును విశ్రమము నిలుపవలయును గబ్బం
బులఁ గావున నే నెఱిఁగెద
నిలిపిన సత్కవులపల నెఱిఁగి నిలువుఁడు వానిన్. 35

1 చ-లో నీపద్యముతరువాత "ఇది వాదీంద్రచూడామణి...విరచితంబైన ఛందోగ్రంథము ...ంపూర్ణము" అని యున్నది. 2 చ-లో, "క. ఇట నుండి నన్నయ విభుఁడు, పాటనలఁ గల్పింపవలయుఁ గబ్బంబుల నెచ్చట నే నిలిపిన బాగు లచ్చటఁ దగుఁ బరికించి నిలుప శాస్త్రప్రౌఢిన్. క. వృత్తము లకుఁదగు చిహ్నము, వృత్తగణాక్షరము తెలుపు విశ్రామంబుల్, వృత్తార్థము నన చెప్పెదు, వృత్తసమూహంబు లెల్ల చేయుఁగఁ బాగడన్. ఇది మొదలుగా యతులు గలవు." అని యున్నది.

వ. పఙ్క్తిచ్ఛందంబునకుఁ బది యక్షరంబులు పాదంబుగా ౧౦౨౪ వృత్తంబులు పుట్టె. అందు,

రుగ్మవతీవృత్తము.—

వాగ్మి! భమస్రవ్యక్తి సగంబుల్
రుగ్మవతీ సద్రూపక మయ్యెన్. 36

మత్తావృత్తము.—

మత్తావృత్తం బగు మభసంబు
దృప్తేజస్వీ! గయుతము గాఁగన్. 37

మయూరసారివృత్తము.—

పన్నగారజంబుపై రగంబుల్
సన్నుతా! మయూరసారిఁ జెప్పన్. 38

[1]శుద్ధవరాటీవృత్తము.—

[2]సంబుద్ధిన్ మసజంబుతోఁ గకా
రంబై శుద్ధవరాటి నాఁ జనున్. 39

పణవవృత్తము.—

యత్నంబై మనయగముల్ వాక్ఛ్రీ
పత్నీవల్లభ! పణవం బయ్యెన్. 40

వ. త్రిష్టుప్ఛందంబునకుఁ బదునొకం డక్షరములు పాదంబుగా ౨౦౪౮ వృత్తంబులు పుట్టె. అందు,

శాలినీవృత్తము.—

[3]వంద్య శ్రీసంసేవ్యవక్షా! మతాగా
నింద్యంబై బెన్ శాలినీనామ మయ్యెన్. 41

---

1 ద-శుద్ధవిరాటి. 2 ద-సంబుద్ధీ. 3 ద-పద్యశ్రీసంసేవితా భామతాగా, వేద్యం బైపన్ శాలినీవృత్త మయ్యెన్.

ఇంద్రవజ్రావృత్తము —

ఇత్తాజగాసంగతి నింద్రవజ్రా
వృత్తంబగుక్ సన్నుతవృత్త రేచా! 42

ఉపేంద్రవజ్రావృత్తము.—

నపన్నపద్మా[1]! జతజల్ గగం బీ
యుపేంద్రవజ్రాఖ్యము నొప్పఁ జెప్పన్. 43

రథోద్ధతావృత్తము.—

నందితప్రియ! రనంబులపై రవం
బొందివచ్చిన రథోద్ధతం బగున్. 44

చంద్రికావృత్తము.—

ననరవము వినమ్రవిద్విషా!
ఘనమతిహిత! చెప్పఁ జంద్రికన్. 45

స్వాగతవృత్తము.—

స్వాగతం బగు లసద్గుణలక్ష్మీ
భోగభోగి! రనభల్ గగ యుక్తిన్. 46

కాంతావృత్తము.—

సారప్రభవాద్య! తజావము లా
కారస్మర! పొందినఁ గాంత యగున్. 47

శ్యేనీవృత్తము.—

శ్యేనికిన్ రజంబు చెందఁగా రవం
బానతారి! పొందు నంద మొందఁగాన్. 48

1 జ—జపాశ్య రేచా.

వాతోర్మివృత్తము.—

వారశ్రీవల్లభ! వాతోర్మికి నా
ధారం బయ్యెన్ మభతంబుల్ లగముల్. 49

[1]తోధకవృత్తము.—

శ్రీయుత! భత్రయ సేవ్యగగంబుల్
తోయజలోచన! తోధకమయ్యెన్. 50

వ. జగతీఛందంబునకుఁ బండ్రెం డక్షరంబులు పాదంబుగా ౪౦౯౬ వృత్తంబులు పుట్టె. అందు,

భుజంగప్రయాతవృత్తము.—

జగద్గీతకీర్తి! భుజంగప్రయాతం
బగున్ రేచనా! యద్వయద్వంద్వమైనన్. 51

తోటకవృత్తము.—

తుదిదాఁక సకారచతుష్కముగా
విదితంబుగఁ దోటకవృత్త మగున్. 52

ఇంద్రవంశవృత్తము.—

సన్మానదానా! తతజంబు రేఫతో
విన్నింద్రవంశాహ్వయవృత్తమై చనున్. 53

వంశస్థవృత్తము.—

సముజ్జ్వలాంగా! జతజంబు రేఫతో
నమర్ప వంశస్థసమాహ్వయం బగున్. 54

ద్రుతవిలంబితవృత్తము.—

ద్రుతవిలంబిత దుష్కరవృత్తము
ప్రతిమమయ్యె నభారగణంబులన్. 55

---

1 ద-బ-తోదకవృత్తము. దోధక మని కొందఱందురు.

[1]తోదకవృత్తము —

జలరుహవక్త్ర! నజాయుగణంబుల్
వెలయఁగ దోదకవృత్తముఁ జెప్పన్. 56

స్రగ్విణీవృత్తము.—

వాగ్వధూవల్లభా! వార్ధిరేఖావళిన్
స్రగ్విణీవృత్త విశ్రామముల్ ధాత్రిపై. 57

జలధరమాలావృత్తము.—

మారాకారా! జలధరమాలావృత్తా
కారం బయ్యెన్ మభసమకల్పం బైనన్. 58

[2]ప్రియంవదావృత్తము.—

నయుతమ్మై నెగడినం బ్రియంవదా
హ్వాయ మగున్ భజరవర్గ మిమ్మహిన్. 59

ప్రమితాక్షరవృత్తము.—

అమరంగఁ జేయు సజసావళితోఁ
బ్రమితాక్షరాఖ్యము నపారగుణా! 60

జలోద్ధతగతీవృత్తము.—

జలోద్ధతగతిన్ జసంబుల జసం
బులొంది మొఱఁగింపు భూజననుతా![3] 61

1 క-చ-ల-గా తోదక. 2 ద-ప్రియంవదా. 3 క-భోజవినుతా.

[1]విశ్వదేవీవృత్తము.—

విద్వద్వృందోద్యద్వృత్త! విస్మద్వ్యయంబుల్
యద్వంద్వంబుల్ గావించునవ్విశ్వదేవిన్ 62

వ. అతిజగతీఛందంబునకుఁ బదుమూఁడక్షరంబులు పాదంబుగా
౮౧౯౨ వృత్తంబులు పుట్టె. అందు,

ప్రహర్షిణీవృత్తము.—

సీతిజ్ఞస్తుత! ధరణిన్ బ్రహర్షిణీవి
ఖ్యాతంబుల్ మనజరగంబు లంబుజాస్యా! 63

[2]రుచిరవృత్తము.—

అనంగసన్నిభ! రుచిరాహ్వయం బగున్
ఘనంబుగా జభసజగంబు లొందినన్. 64

[3]మత్తమయూరవృత్తము.—

అస్వోతోద్యద్వ్యాజ్ఞిలయా! మత్తమయూరం
బన్వృత్తంబయ్యెన్ మతయంబుల్ సగయుక్తిన్.

మంజుభాషిణీవృత్తము.—

జగదేకమిత్ర! సజసంబులపై జగం
బగుమంజుభాషిణికి నంద మొందఁగాన్. 66

---

1 ద-లో లేదు. క, డ-లలో దీనితరువాత నాశ్వాసాంతగద్యమునకు బిదప "క. మందరధరనిభనిఖిల, చ్ఛందోఽర్ణవ పారగుండు సత్కవులకు నీ. ఛందోలక్షణ మందం, బొందఁగ నాకవిజనాశ్రయుం డొనరించెన్." అనుపద్యము నున్నవి. పద్యము ద-లోఁగూడ నున్నది. 2-3 క-డ-బ-లలో మాత్ర మున్నవి.

[1] జలదవృత్తము.—

ఆభరనంబులపై భగురువైనఁ గవీం
ద్రాభరణీయమూన! జలదాఖ్య మగున్. 67

[2] ప్రభాతవృత్తము —

మొనసి నజారగముల్ సనం బ్రభాతం
బని యెసువృత్త మనంగసన్నిభాంగా! 68

వ. శక్వరీఛందంబునకుఁ బదునాలు గక్షరంబులు పాదంబుగా ౧౬౩౮౪ వృత్తంబులు పుట్టె. అందు,

వసంతతిలకవృత్తము.—

సారంబుగాఁ దభజజంబు వసంతరాజా
కారా! వసంతతిలకం బగు గాయుతంబై. 69

[3] పరాజితవృత్తము.—

ననరసలగముల్ పెనంగిన నద్యశో
ధన! నినుము పరాజితం బగు రేచనా! 70

[4] వనమయూరవృత్తము.—

నందితగుణా! భజసనంబులు గగం బిం
పొందఁ జనఁగా వనమయూర మగుఁ బేర్మిన్. 71

ప్రహరణకలితవృత్తము.—

[5] ప్రహరణకుశలా! ప్రహరణకలితా
సహజము లనఁగాఁ జను ననభనవల్. 72

---

1. క-చ-డ-ట-లలో నున్నది. 2 క-చ-డ-లలో నున్నది. 3 చ-డ-లలో అపరాజితము. 4 క-చ-డ-లలో నున్నది. 5 ద-ప్రహరణకలితం.

అసంబాధవృత్తము.—

[1]సారప్రజ్ఞాంభోనిధి పురుష! యసంబాధా
కారాన్వితంబై చను మతనసగాయుక్తిన్. 7

భూనుతవృత్తము.—

శ్రీనివాస! రనభావలిఁ జొది గగంబుల్
భూనుతంబుగ నొడంబడి భూనుత మయ్యెన్. 7

[2]సుందరవృత్తము.—

సుందరరూపసమేత! సుందరవృత్త మిం
పొందుచు భారసవంబు లొంది బెడంగగున్. 7

వ. అతిశక్వరీఛందంబునకుఁ బదునై దక్షరంబులు పాదంబు
లై ౩౨౭౬౮ వృత్తంబులు పుట్టె. అందు,

[3]మణిభూషణశ్రీవృత్తము.—

శ్రావకాభరణ! శుభ్రయశా! మణిభూషణ
శ్రీ వెలుంగు రనభారవిశేషగణంబులన్. 7

అలసగతివృత్తము.—

[4]పొలసి నసనంబు భయముల్ వెలయఁగా నిం
దలసగతి నొందుఁ గృతియందు నుతియందున్. 7

1 ద-సారప్రాగంభోనిధి. 2 ద-లో నున్నది. 3 ప-లో లేదు
ద-మెలఁచి.

వ. *అష్టిఛందంబునకుఁ బదియా అక్షరంబులు పాదంబుగా
౬౫౫౩౬ వృత్తంబులు పుట్టె. అందు,

పద్మకవృత్తము.—

సభజజంబులు జగంబుఁ బెనంగి యతు ల్దిశా[1]
ప్రభవ న్గని శిబిజనాశ్రయ! పద్మకమనంజనున్. 78

ప్రియకాంతావృత్తము.—

నయనయసంబుల్ గురువు పెనంగం బ్రియకాంతా
హ్వాయమగు శిష్టామరతరువా! దిగ్యతిన్మైనన్.[2] 79

చంద్రశ్రీవృత్తము.—

కపీంద్రేంద్రధ్వజా! యమనసరగప్రాప్తమైనన్
గపీంద్రాల్ చంద్రశ్రీయనిరి యతిగా రుద్రసంఖ్యన్.

మేదినీవృత్తము.—

నజభజముల్ రగంబులఁ బెనంగి దిగ్విరామ
ప్రజనిత లొప్పు మేదినికిఁ బంకజోపమాస్యా! 81

పంచచామరవృత్తము.—

[3]కనద్యశా! జరంబులో జకారముల్ రజంబులున్
జనన్ గకారయుక్తిఁ బంచచామరం బగున్ ధరన్.

[4]మదనదర్పవృత్తము.—

శ్రీభసజసజల్ గయుక్తిఁ జెంది వచ్చినం గుమా
రాభ! మదనదర్ప మయ్యె నబ్జభూవిరామమై. 83

---

* ఇచ్చటనుండి యతిస్థానము నక్కాణింపఁబడినది. 1 సి-యతిన్ దశా. 2 ద-శిష్టాదరత దశావిశ్రమమైనన్. 3 వ-చ-లలో 'జరల్ జగల్ జగంబు గూడెఁజాలి రేచనా నిధి, స్ఫురద్విరామమై ధరిత్రిఁ బొల్చుఁ బంచచామరన్.' అనియున్నది. 4 బ-లో మాత్ర మున్నది.

వ. అత్యష్టిఛందంబునకుఁ బదియేడక్షరంబులు పాదంబుగా ౧౩౧౦౭౨ వృత్తంబులు పుట్టె. అందు,

శిఖరిణీవృత్తము.—

పురారాతిస్ఫూర్తీ! యమనసభవంబుల్ పెనఁగి సుం
దరంబైనన్ రేచా! శిఖరిణియగున్ ద్వాదశయతిన్.

[1]సుగంధివృత్తము.—

భాసురంబుగా రజద్వయంబుపై రవంబు గూడఁగా
నాసుగంధికిన్ దిశావిరామ మంచితం బగున్ ధరన్.

హరిణీవృత్తము.—

నసమరసవప్రోక్తంబై రుద్రసన్యవిరామ మిం
పెసఁగ హరిణీవృత్తంబయ్యెన్ గవీంద్రజనాశ్రయా!

[2]పాలాశదళవృత్తము.—

కదియఁగ ననసన నగగములకును బాలా
శదళ మనఁ జనునది దశమయతియుఁ గాఁగన్. 87

మందాక్రాంతావృత్తము.—

కాంతాకాంతా! మభనతతగా కాంతి సంక్రాంతి[3] మందా
క్రాంతంబన్పే రమరు దశమాశ్రాంతవిశ్రాంతి మెసన్. 88

నర్కుటవృత్తము.—

నజభజజల్ వకారము పెనంగిన నర్కుటకం
బజితగుణాన్వితా! యతి దిశాన్వితమై పరఁగున్. 89

---

1 బ-లో మాత్ర మున్నది. 2 చ-లో మాత్ర మున్నది. దీని కింక త్వరితపదగతి యను నామాంతరము గూడఁ గలదు. 3 చ-మ-సంతాన.

[1]పృథ్వీవృత్తము —

ప్రియంబగుచు రుద్రవిశ్రమము పృథ్వికాసంజ్ఞికా
హ్వయం బగు జసంబులో జసయవంబులుఁ గూడినన్.

వ. ధృతిచ్ఛందంబునకుఁ బదునెనిమిది యక్షరంబులు పాదం
బుగా ౨౬౨౧౪౪ వృత్తంబులు పుట్టు. అందు,

కుసుమితలతావేల్లితావృత్తము —

అశ్రాంతత్యాగాన్విత! మతనయాయంబులన్ రుద్రసంఖ్యా
విశ్రాంతిం జెప్పఁగ గుసుమితలతావేల్లితావృత్త మయ్యెన్.

మత్తకోకిలవృత్తము —

శ్రావకాభరణాంక! నీ రసజాభరేఫల దిగ్విరా
మావహంబుగ మత్తకోకిల యండ్రు దీనిఁ గవీశ్వరుల్. 92

[2]అతివినయవృత్తము —

ననలుగలయుఁగ ననలనసయుతము లగుచున్
దనరు నతివినయ మిది దశయతి కృతులన్. 93

[3]త్వరితపదగతివృత్తము —

నగసిరుహాభ ననదృశ చతుర! ననననాయుక్
త్వరితపదగతి కమరు దశమయతియుఁ గాఁగన్. 94

వ. అతిధృతిచ్ఛందంబునకుఁ బందొమ్మిది యక్షరంబులు పాదం
బుగా ౫౨౪౨౮౮ వృత్తంబులు పుట్టు. అందు,

శార్దూలవిక్రీడితవృత్తము —

సారాచారవిశారదా! యినయతిన్ శార్దూలవిక్రీడితా
కారంబై మసజమ్ము లిమ్ముగ సతాగప్రాప్తమై చెల్వగున్.

---

1 క-బ-లలో నున్నది. 2 క-లో మాత్ర మున్నది. 3 క-బ-లలో మాత్ర మున్నది.

మేఘవిస్ఫూర్జితవృత్తము— [ఖ్యాం

మృగేంద్రోద్యచ్ఛౌర్యా! యమనసముల న్మేఘవిస్ఫూర్జితా
బగు స్త్రీఁద న్రాగంబొడఁబడిన సూర్యాంకవిశ్రాంతమైనన్.

తరలవృత్తము.—

ప్రవర రుద్రవిరామయుక్తి నభంబులు న్రసజాగముల్
గవిజనాశ్రయ! పొంది యందముగా మహి న్దరలం బగున్.

చంద్రకళావృత్తము —

శ్రవణాభరణాంక ! దిశావిశ్రామముతోడ రసాతముల్
జావిలగ్నగకారయుతంబై చంద్రకళాహ్వయమై చనున్.

భూతిలకవృత్తము.—

భారసజాగగణంబుల న్గుచభారనమ్రమవధూముఖాం
భోరుహభాస్కర! రుద్రయుగ్యతిఁ బూని భూతిలకం బగున్.

[1] శుభికావృత్తము.—

సూక్తిస్తుత్యా! మభనసవిలసితసూర్యయతి న్శుభికా
కారంబై యెల్లకృతులవెలయును గల్పితభాగలచే న్. 100

వ. కృతిచ్ఛందంబున కిరువది యక్షరంబులు పాదంబుగా
౧౦౪౮౫౭౬ వృత్తంబులు పుట్టె. అందు,

మత్తేభవిక్రీడితవృత్తము —

స్మయదూరా! విలసత్త్రియోదశయతి న్మత్తేభవిక్రీడితా
హ్వయ మయ్యె న్సభరంబులు న్నమయవవ్రాతంబులు న్
గూడినన్.

1. బ-లో మాత్ర మున్నది.

ఉత్పలమాలావృత్తము.—

భానుసమాన! విస్ఫురనభారలగంబులఁగూడి విశ్రమ
స్థానమునందుఁ బద్మజయుతంబుగ నుత్పలమాలయై చనున్.

అంబురుహావృత్తము —

శ్రీరమణీప్రియ! మల్లియరేచ! విశిష్టకల్పమహీజ! భా
భారసనంబుల నంబురుహం బగు భానువిశ్రమయుక్తమై.

[1] ఖచరప్లుతవృత్తము.—

అమితసాహస! రుద్రవిరామయుత్తమమైన నభామసా
నములఁగున్ ఖచరప్లుతనామవృత్తినియుక్తసమేతమై. 104

[2] ప్రభాకలితవృత్తము.—

వెలయునజాభరసంబులున్ రవివిశ్రమంబులునుం బ్రభా
కలితము నొప్పునగణ్యపుణ్య! లగంబు మీఁద ధరన్ గృతిన్.

వ. ప్రకృతిచ్ఛందస్సున కిరువదియొక్క యక్షరంబులు పాదంబు
గా ౨౦౯౭౧౫౨ వృత్తంబులు పుట్టె. అందు,

స్రగ్ధరావృత్తము.—

శ్రీమన్మూర్తీ! మకారాశ్రితరభనయయాసేవ్యమై సానుమద్వి
శ్రామంబై సానుమద్విశ్రమమున మరఁగా స్రగ్ధరావృత్తమయ్యెన్.

చంపకమాలావృత్తము.—

నజభజజల్ జరేఫలు పెనంగి దిశాయతితోడఁ గూడినన్
[3] త్రిజగదభిస్తుతా! బుధనిధీ! విను చంపకమాలయై చనున్. 107

---

1 ద-ఖచప్లుతము. 2 క-ద-ల లోనున్నది. బ-లో దీనికే భంగ్యంతరముగా లఘుప్రభాకలితవృత్తము గలదు. అమర నజాభరసంబులున్ లగముండు సూర్యవిరామమున్, గొమరుగఁ జెందు నవేందుమౌళి లఘుప్రభాకలితాఖ్యమున్. 3 ద-త్రిజగదభీష్టదా.

[1]లాటీవిటవృత్తము.—

ససమామతయంబులు సూర్యయతిశ్రవ్యంబై లాటీవిటవృత్తం
బసమానయశా! నుతమానగుణా! యాశ్చర్యాన్వితంబగు ధాత్రిన్

వనమంజరీవృత్తము.—

నయుతజకారచతుష్కభరేఫగణత్రయోదశవిశ్రమా
శ్రయమగు నవ్వనమంజరి రేచన! సర్వశాస్త్రవిశారదా!

మణిమాలావృత్తము.—

కదియంగ మూఁడు సజముల్ సకారయుతమై దిశాఖ్యయతిగా
మదనానుకారి! నిఖిలాగమజ్ఞ! మణిమాలయండ్రు సుకవుల్.

[2]కరిబృంహితవృత్తము.—

మూఁడు భనములుగూడి రగణముట్టికొనఁ గరిబృంహితం
బౌడువనము నిజార్థమునఁ గలయం ద్రిదశయతి నక్కలన్.

వ. [3]ఆకృతిచ్ఛందంబున కిరువదిరెం డక్షరంబులు పాదంబుగా
౪౧౯౪౩౦౪ వృత్తంబులు పుట్టె. అందు,

మహాస్రగ్ధరావృత్తము.—

లసదుద్యత్కీర్తివల్లీ లలితగుణగణాలంకృతాంగా! సతాస
సరాగంబుల్ మహాస్రగ్ధరకు వసుమునిస్థానవిశ్రాంతినొప్పున్

[4]సుభద్రకవృత్తము.—

మందరభృత్సమాన! నిఖిలాగమజ్ఞ! వెలయంగ రుద్రయతితో
నందముగా భసంయుతరనత్రయాగ్రగురువై సుభద్రకమగున్.

---

1. చ-లాటవిట. 2 బ-లో మాత్రమున్నది. 3. క-అతికృతి 4. చ-డ-బ-లలో దీనికిఁ జంద్రకమను పే రున్నది.

మానినీవృత్తము.—

కారకముల్ క్రియ గన్గొన నేడుభ
కారము లొక్క గకారముతోఁ
గారవమై చనఁగా యతి పన్డెటఁ
గల్గిన మానిని కామనిభా! 114

[1] తురగవృత్తము.—

ససనస సజములను జగము దుద నాటుకొల్పిన రేచనా!
చనుఁ దురగ మన జగతి నిది మనుసంప్రయుక్తవిరామమై.

వ. వికృతిచ్ఛందంబున కిరువదిమూఁడక్షరంబులు పాదంబుగా
౮౩౮౮౬౦౮ వృత్తంబులు పుట్టె. అందు,

అశ్వలలితవృత్తము.—

సజగణముల్ భజద్వయముతోఁ బె
నంగి భవయుక్తమై ధగణి నూ
ర్యజ మగువిశ్రమం బమరియున్న
నశ్వ లలిత మ్మగుణ గుణనిధీ! 116

[2] విరాజవిరాజితవృత్తము.—

క్రమమున నొక్కనకారము నాఱుజ
కారములుం బరఁగంగ వకా
రమును నొడంబడి రాఁ గవిరాజవి
రాజిత మన్నది రామనిభా! 117

---

1. బ—లో మాత్ర మున్నది.

వ. [1] సంకృతిచ్ఛందంబున కిరువదినాలుగక్షరంబులు పాదంబుగా ౧౬౭౭౭౨౧౬ వృత్తంబులు పుట్టె. అందు,

సరసిజవృత్తము.—

మారాకారా! చారుచరిత్రా!
మతయనననస [2]మహితయతిరచనన్
సారంబైనన్ సూరికవీంద్రుల్
సరసిజ మని వినఁ జదివిరి సభలన్.[3] 118

క్రౌంచపదవృత్తము —

పంచశరాభా! సంచితపుణ్యా!
భమసభననననయపరిమితమైనన్,[4]
క్రౌంచపదాఖ్యం బంచిత మయ్యెన్
క్రమయతి దశవసుకలితము గాఁగన్.[5] 119

వ. [6]అభికృతిచ్ఛందంబున కిరువదియై దక్షరంబులు పాదంబుగా ౩౩౫౫౪౪౩౨ వృత్తంబులు పుట్టె. అందు,

బంధురవృత్తము.—

అమరఁగ నననననసభభభగయుతం
బై తిథివిశ్రమ మొంది చనన్
ప్రముదితకువలయ! పరహితచరితా!
బంధుర మన్నది వృత్త మగున్. 120

---

1 చ-సత్కృతి. ప-సుకృతి. 2 క-చ- మహితప్రచనన్. 3 గ-చ- మొదలన్. 4 క-ప- పరివృతమైనన్. 5 చ- గసదశకలితము గాఁగన్. 6 క-లో నీఛందస్సు లేదు.

భాస్కరవిలసితవృత్తము.—

భాస్కరసదృశ సముజ్జ్వలతేజా!
భాసుర భనజయభననసగంబుల్
భాస్కరవిరమణబంధుర మైనన్
భాస్కరవిలసిత మనిరి కవీంద్రుల్. 121

[1]జలదరవవృత్తము.—

నన నన ననలు ననల నొడఁబడి
నయవినయనిధి! వినుము రే
చన! మనుయతిని నిలుపఁగ మహిని
జలదరవ మగు గురువుతోన్. 122

వ. [2]ఉత్కృతిచ్ఛందంబున కిరువదాఱక్షరంబులు పాదంబు గా ౬౭౧౦౮౮౬౪ వృత్తంబులు పుట్టె. అందు,

భుజంగవిజృంభితవృత్తము.—

[3]ధీరాసారత్వోదారత్వస్థిరగుణా! వసు
దశమయతిన్ భుజంగవిజృంభితా
కారం బారంగాఁ దోఁచున్ సంగతమమతన
ననరసలగల్గా వయుతంబుగాన్. 123

---

1 బ–లో మాత్ర మున్నది. 2 ద–వ్యుత్కృతి. 3 ద–ధీరాధార త్వోదార త్వావృత.

మంగళమహాశ్రీవృత్తము.—

శ్రీమహిత! లోకహిత! శివజనసేవిత!
విశిష్టగుణ! మంగళమహాశ్రీ
[1]నామ మగు నబ్జజననంబులకడఁ
భజననంబులు గగంబులు పెనంగన్. 124

[2]క. కమనీయంబగు నీక్రియ
సమవృత్తము లిరువదాఱుఛందంబుల నీ
క్రమమున మల్లియరేచన
రమణీరమణీయరమణరమణుఁడు చెప్పెన్. 125

— ఉద్ధరమాలావృత్తములు. —

క. పరఁగఁగ నిరువదియాఱు
క్షరముల కగ్గలము చెప్పఁగాఁ బాదము లు
ద్ధరమాలావృత్తములై
పరఁగు లయగ్రాహి లయవిభాతి యనంగన్. 126

---

1 ద-నామమునకున్ భజననంబులు పెనంగు ననునామ యతి కల్పింపఁ దుదిన్ గాన్. 2 ఈపద్యము పిదపఁ జాల ప్రతులలో నీక్రిందిపద్య ముండెను. చ. ఒగిఁ బదుమూఁడు కోటులును నొప్పఁగ నల్వదిరెండు లక్షలున్, బ గఁ బదియేడు వేలు విదితంబుగఁ దానట నేడునూటిపై, నగణితవైభవా! యిరువదాఱగు సంఖ్యఁ జెలంగి యొప్పెడున్, సగుణి యిర్వదాఱు నగు ఛందములన్ సమపాదవృత్తముల్. దీ-లో 3, 4 పాదములు. అగణితవైభవా! యిరువదాఱగు సన్నుతపాద వృత్తముల్, జగమున నెన్నిమాఱఁగ విశాలయశోనిధి రేచక్షీమణీ!

లయగ్రాహివృత్తము.—

[1]ఇం బడరఁగా భజసనంబులకడన్ భజస
నంబులు భకారము నొడంబడి లయగ్రా
హిం బరఁగఁ జెప్పు కలశం బిడినయట్లు యగ
ణంబు కృతిమీఁద నమరుం బరహితార్థీ! 127

లయవిభాతివృత్తము.—

ససససనంబులును నసననసగంబులును
నెసఁగఁగృతి పాదముల రసికతను జెప్పన్,
గుసుమశరవత్సుభగ! యసదృశగుణా! వినుత
రస! లయవిభాతి యని రసముసుకవీంద్రుల్. 128

త్రిభంగివృత్తము.—

ననననలును ససభములును సగయుక్తము లైనన్
మృదు వైనన్ బ్రస్తుత మైనన్
వసరుహాభవనిభ! మన మలరఁ ద్రిభంగిని జెప్పన్
వడి దప్పన్ బ్రాసము లొప్పన్. 129

[2]లయహారివృత్తము.—

పదునొకఁడునగణములతుద సగణమును గురువుఁ
గదిసి మృదుపదరచన నొదవి క్రియఁ బ్రాసా[3]
స్పదనిరతి నునుపఁదగు నది సుకవివరులు పొగ
డును రసమబహుకృతుల విదితలయహారిన్. 130

1 ద-లో లేదు. 2 డ-లయవిహారి. 3 ద-వా చా.

[1]దండకలక్షణము.—

అమరంగ ననహంబులం[2]దాదిగా నొండె, కాదేని నాదిన్ దకారంబుగా నొండె, లోనన్ దకారంబు లిమ్మైఁ గకారావసానంబుగాఁ జెప్పినన్, దండకం బండ్రు దీనిం గవీంద్రుల్ జగద్గీతకీర్తీ! పురారాతిమూర్తీ! సదాచారవర్తీ! సముద్యద్గుణార్ధీ! వణిగ్వంశచూడామణీ! బంధుచింతామణీ! శిష్టరక్షామణీ! సుందరీవశ్యవిద్యామణీ! రేచనా! కావ్యసంసూచనా[3]! 131

— అర్ధసమవృత్తములు. —

[4]క. కమలాధీశుఁడు రేచన
కమలాసనకమలనాభకమలాప్రియవృ
త్తముల మహత్త్వము తేజ
స్సమేతుఁ డొనరించు నర్ధసమవృత్తములన్. 132

[5]క. ఆదిద్వితీయవిలస
త్పాదంబుల వేఱువేఱుభంగుల నిడ న
ప్పాదములఁ బోలఁ దక్కిన
పాదము లర్ధసమవృత్తపద్ధతి నొప్పున్. 133

1 ప-లో లేదు. 2 ప-అనురంగ సనహంబులన్. 3 డ-త్యాగశైరోచనా. క- చ- లలో దండకాంతమునఁ బ్రకరణాంత గద్య మున్నది. డ-లో "ఇది స్వస్థానసంస్థానవృత్తాధికారము" అని యున్నది. 4 క-డ-లలో మాత్ర మున్నది. 5 క-ప-ద-లలో నున్నది.

వ. అర్ధసమవృత్తంబు లన్నవి స్వస్థానార్ధసమవృత్తములు, పరస్థానార్ధసమవృత్తములు నా రెండుదెఱంగు లయ్యె. స్వస్థానార్ధసమవృత్తము లన్నవి యుక్తాదిషడ్వింశతిచ్ఛందంబులలో నొక్కఛందంబున మొదలిపాదంబును [1] రెండవపాదంబును మూఁడవపాదంబును నొక్క వృత్తముగా వ్యత్యాసముచేసి చెప్పునవి. మఱి పరస్థానార్ధసమవృత్తము లన్నవి మొదలిపాదంబును మూఁడవపాదంబును నొక్కఛందంబున రెండవపాదంబును నాల్గవపాదంబును నొక్కఛందంబునఁ జెప్పునవి.

స్వస్థానార్ధసమవృత్తములలో.—

నారీప్లుతవృత్తము.—

[2] నారశ్రీసంసేవ్యవక్షా! మతాగా
కారంబు నిత్తాజగగస్వరూపం
బారంగం బూర్వాపరార్ధంబు లై నన్
నారీప్లుతం బన్నది నామ మయ్యెన్. 134

1 ద-నా-ఛందంబున నొక్కవృత్తంబున రెండవపాదంబును మూఁడవపాదంబును నాల్గవపాదంబును నిట్లు వ్యత్యాసముగాఁ జేసి చెప్పునవి. మూలము స్పష్టముగా లేదు. వృత్తిమంతయు నొకఛందమునకే చేసియుండి బేసిపాదము లొకవృత్తమునకును సరిపాదములు వేఱొకవృత్తమునకును సంబంధించి యున్నవో నది స్వస్థానార్ధసమవృత్తమగు నని భావము. 2 క-చ-ద-లలో నున్నది. ఈవృత్తము త్రిష్టుప్ఛందములోనిది. బేసిపాదములు శాలినీవృత్తలక్షణమునకును సరిపాదము లింద్రవజ్రవృత్తలక్షణమునకును సరిపడును.

రతిప్రియవృత్తము.

[1]ఖ్యాతంబై మనజరగ వ్రజంబుతో సం
గతంబుగా జభసజగంబు లూర్జిత
శ్రీతన్వీప్రముదితచిత్త! చిత్తజాభా!
రతిప్రియం బనిరి తిరంబుగాఁ గవుల్. 135

[2]అజితప్రతాపవృత్తము.—

సజసాగణాళివిక సన్నవనీ
రజముఖా! నభజరవ్రజంబుతో
నజితప్రతాప కుభయార్థముగా
నిజముగాఁ దగు ననుం దిరంబు గాఁగ. 136

పరస్థానార్ధసమవృత్తములలో.—

కోమలీవృత్తము.—

జననుతకీర్తి! నజాయగణంబుల్
ఘనంబుగా జభసజగవ్రజంబుతో

1 క-ద-లలో మాత్ర మున్నది. ఈవృత్త మతిజగతీఛందస్సులోని నిది. బేసిపాదములు ప్రహర్షిణీలక్షణమునకును సరిపాదములు రుచిరవృత్త లక్షణమునకును సరిపడుచున్నవి. 2 క-ద-లలో మాత్రమున్నది. ఇది జగతీ ఛందములోనిది. బేసిపాదములు ప్రమితాక్షరావృత్తలక్షణమునకును సరిపాదములు ప్రియంవదావృత్తలక్షణమునకును సరిపడుచున్నవి.

ననుపములై యుభయార్థములందుఁ
బెనంగఁ గోమలియను పేరొందంబడుఁ. 137

మనోహరవృత్తము —

[1]చారిత్రనిదాన! తజావము లు
ద్ధురమయ్యె సకారచతుష్కముతోఁ
నారంగఁ బడ న్నుభయార్థములఁ
విరచింప మనోహరవృత్తముగుఁ. 138

మణివితానకాంతివృత్తము.—

[2]సంబుద్ధీ! మసజంబుతోఁ గకా
[3]రంబుతోఁ రనమురంబునఁ వకా
రంబొందఁ గవిరాజితోఁభయా
ర్థంబగుఁ మణివితానకాంతికిఁ. 139

---

1 బేసి పాదములు త్రిష్టుప్ ఛందస్సులోని కాంతావృత్త లక్షణమునకును, సరిపాదములు జగతీ ఛందస్సులోని తోటకవృత్తలక్షణమునకును సరిపడుచున్నవి.

2 విషమపాదములు పంక్తిఛందస్సులోని శుద్ధవిరాట్వృత్తమునకును, సమపాదములు త్రిష్టుప్ఛందస్సులోని రథోద్ధతవృత్తమునకును జేరుచున్నవి, ఇది క- ద- లలో నున్నది.

3 రంబుతో రసరం బందుపైవకా, అని పాఠాంతరము.

క. ఇప్పాటఁ దొల్లి పింగళు
చెప్పినక్రియఁ దప్పకుండఁ జెలు వలరంగాఁ
జెప్పఁబడె వళ్లుప్రాసలు
తప్పక యర్ధసమవృత్తతతి విదితముగాన్. 140

గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైన కవిజనాశ్రయం బనుఛందంబునందు వృత్తాధికారము.

---

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము

## జాత్యధికారము.

---

క. [1]శ్రీకమనీయుఁడు వాణీ
శ్రీకమనీయుండు ధాత్రి రేచన కీర్తి
శ్రీకమనీయుఁడు సకలక
ళాకుశలుఁడు చెప్పె జాతిలక్షణ మొనరన్. 1

క. జాతులు మాత్రాసముక
[2]ఖ్యాతగణప్రతతిఁ జెప్పఁ గందము లార్యా
గీతులు మొద లగునవి యుప
జాతులు భూతలని నూత్నజాతయశస్కా! 2

---

1 క-డ-ల-లో, శ్రీకాంతాసఖుఁడా శాం, తాకాంతనితాంతకాంతుఁ డగు రేచన వా, క్ఛ్రీకమనీయుఁడు (శేషము సమానము). ద-లో, శ్రీకాంతాసఖుఁడును గాం, తాకాంతనితాంతకాంతుఁ డగుచు- సదావా, క్ఛ్రీకమనీయుఁడు (శేషము సమానము) 2 క-ప-డ-లలో, ఖ్యాతగణప్రతతిఁ జెప్పఁ గందము లార్యాగీతులు మొదలుగఁ గలయవి (శేషము సమానము)

— కందము. —

క. ఆది గురు విడిన గురువే
పాదాదుల నెల్ల నిలుపఁబడుఁ గందములం
దాది లఘు విడిన లఘువే
పాదాదుల [1]నిలుపవలయుఁ బరహితచరితా! 3

క. [2]వెలయఁగ గాథజసనలం
బులు నేనును గాని కందమున కొండు గణం
బులు చొరవు, వానిపాదం
బుల నిడు నది మూఁడు నేను మూఁడు న్నేనుక. 4

క. [3]హిమకర పుర శర నగముల
నమరుపఁగాఁ జనదు జగణ మొదలిరెండ
ర్ధములన్ నల మొండె జకా
రమొండె నాలవయెడం దిరము గావలయున్.[4] 5

---

1 ద-నిడఁగ. 2 ప-ద-లలో లేదు. ಗಿರಿಶಂ ಧೂರ್ಜಟಿ ಶರ್ವಂ, ಪುರಾರಿ ಮಖರಿಪು ವೆನಿಪ್ಪವಿಂತೆ ದ್ಧುಗಣಂ, ಬರೆ ಶಶಿಪುರವಿಷಯಾದ್ರಿಮೊ, ಳಿಗದಿರ್ದ್ದ ಪುರಾರಿ ಯೆಂಬಗಣಮಬ್ಜಮುಖೀ. (ಕರ್ಣಾಟಕಚ್ಛಂದೋಂಬುಧಿ) 3 ಶಶಿಪುರಬಾಣಾದ್ರಿಗಳೊಳ್, ಬಿಸಜಮುಖೀ! ಮಧ್ಯಗುರುಗಳಾಗಲ್ ಕಂದಂ, ಪುಸಿಯತ್ತೆ? ಗಂಪನಿಲ್ಲಸ, ಶಶಿವದನೆ ನೆಗರ್ಭ ಮಾಪ ತೆಅಕೊಳ್ ಕೆಡುಗುಂ, (ಕ-ನಾ.) 4 ఈ పద్యము తరువాత ప-ద-లలో- ద్వాదశమాత్రలు మొదలిడఁ, బాదం బగు నాద్యంతీయపాదంబునకున్, ద్వాదశమాత్రలు చన యతి, కాఁదగు ఐనుమాత్ర లర్ధకందము రేచా! అను పద్యమున్నది.

క. [1]కందము త్రిశరగణంబుల
[2]నందును, గాభజసనలము లైదునె గణముల్ ;
పొందును నాఱిట నలజము,
లొందుం దుదిగురువు, జగణ మొప్పదు [3]బేసిన్. 6

క. [4]నెల వెఱఁగి నిడుదపాదం
బుల నాలవగణము మొదలఁ బొదలఁగ నిడఁ గా
వలయును వల్లాపాదం
బులతుద గురు వమరఁ గందమున కిడవలయున్. 7

— ఆర్య. —

క. [5]క్రమమునఁ గందము రెండ
ర్ధములతుదన్ గురువు లుంచి, తప్పక కడయ
ర్ధము నాఱవయెడ లఘు విడ
నమితగుణైశ్వర్యధుర్య ! యది యార్య యగున్. 8

---

1 కందము త్రిశరగణంబుల, నందము గాభజసనలము లట వడి పూఁటన్, బొందును నలజల నాఱిట, నొందుం దుదగురువు జగణముండదు బేసిన్ (సులక్షణసారము). 2 ప-నందముగా భజసనలములటముని యతిపై. ద- నందము గగభజసనలములైదే గణముల్. 3 ద- మూఁడదు. 4 ప- లో బేదు. 5 లక్ష్మైతత్సప్తగణా గోపేతా భవతి నేహ విషమేజః । షష్ఠోయం చ నలఘువా ప్రథమేర్ధే నియతమార్యాయాః, షష్ఠే ద్వితీయలాత్పరకే న్లేముఖలాచ్చ యతి పదనియమః । చరమేఽర్ధే పంచమకే తస్మాదిహ భవతి షష్ఠోలః. (వృత్తరత్నాకరము). వి-గదేళ్ గణముంబ కాన్, ర్యగెముంతం తు దియొ ళొండె గురుతాంబుంది, న్నగలదె పదార్థవోళ్ శిషు, మృగాక్షి !, లఘు

— గీతి, ఉపగీతి, ఉద్గీతి. —

క. [1]అమరంగ నార్యాపూర్వా
ర్ధమునన చెప్పనది గీతి, తత్క్రియనపరా
ర్ధమున నుపగీతి, తద్వ్య[2]
త్యయమున నుద్గీతి యగు జగద్గీతయశా ! 9

---

వొందె బందు నిలుకంరసదొళ్. మొదలొళ్ పన్నెరడెరడనె, యదఱొళ్ పదినెంటు మూఱఱొళ్ పన్నెరడం, త్యదపాదదల్లి పదినైదుమాత్రా నియమ మార్యెయొళ్ వనజముఖీ. (కర్ణాటచ్ఛందోంబుధి). కందపద్యము ద్వితీయ చతుర్థ పాదాంతగణములకుబదులుగా నొక్కొకగురువును, చతుర్థపాదమందా అవగణమునకు బదులుగా నొక్క లఘువును బెట్టినచో నది యార్య యగును. ఆర్యప్రథమతృతీయపాదములకుఁ బన్నెండేసిమాత్రలును, ద్వితీయ పాదమునకుఁ బదునెనిమిది మాత్రలును, చతుర్థపాదమునకుఁ బదియేను మాత్రలునుండును.

1 ఆర్యాప్రథమార్ధమును బోలియే ద్వితీయార్ధముకూడ నుండిన నది గీతి యనియు, ఆర్యాద్వితీయార్ధమును బోలి ప్రథమార్ధము కూడనుండిన నది యుపగీతియనియు, ఆర్యాప్రథమార్ధమునుబోలి ద్వితీయార్ధమును, ద్వితీయార్ధమునుబోలి ప్రథమార్ధము నుండినచో నది యుద్గీతి యనియు నర్థము. ఈలక్షణములు వృత్తరత్నాకరమునందలి లక్షణముల ననుసరించి యున్నవి. వృత్తరత్నాకరమందార్యాగీతి యను నింకొకగీతి చెప్పఁబడినది. దానిలక్షణము:—ఆర్యాపూర్వార్ధం యది గురుణైకేనాధికేన నిధనే యుక్తమ్, ఇతర త్తద్వన్నిఖిలం దలం యదీయముదితేఽయమార్యాగీతిః. ఇది కంద పద్యలక్షణమునకు సరిపోవును. ఛందోఽంబుధిలో గీతిమాత్రము చెప్పఁబడి యున్నది. 2 ద-తత్క్రియఁ బశ్చార్ధమునందుఁ జెప్పఁగా నీ. వీనితో సాంస్కృతికజాతులు సమాప్తము.

— తెనుఁగు జాతులు. 1 —

క. [2] వెలయంగఁ దెనుఁగుబాసకుఁ
జల మయ్యెడు సీసములును దరోజ్వాలు గీ
తులు నక్కరలును ద్విపదలు
పొను పొందఁగ రేచఁ డిష్టమున నొనరించుక్[3]. 10

— సీసములు. —

క. *ధాత్రిక్ గవిత్వతత్త్వము
పాత్రతఁ గడునొప్ప వెలయుఁ (బ్రాజ్ఞులచేతక్)
మాత్రోక్తి నష్టగణముల
మాత్రలు సీసముల కెల్ల మల్లియరేచా![4] 11

క. [5] నలనగసలభరతలలో
పలనాలును మీఁద రెంటు పద్మాప్తగణం

1 ఈత్రిక మాతృకలో లేదు. 2 చూ. అర్ణవ జాతానసె సం, పూ
గ్గతెయిం సకలవిషయ భాషాదిగళం, నిర్ణయమాగలుపిదెవాం, కర్ణాటక
భాషెయుంపమం కేళ్ పేళ్వెం. (కర్ణాటకచ్ఛందోంబుధి.) 3 చ-లోఁగ
గోర్వాలు నం, దుల షట్పదములు నక్కరములు ద్విపదలు రేచఁడిష్టముగ
నొనరించున్. ప - 4 - నపాదము. బలురగడలు మంజరియును బలుకుదుఁ
నొనరించున్. ప - 4 - నపాదము. 4 క - ప - లలో, మాత్ర వసు దశమ నవమ, ణామాత్రలు సీస
గృతులన్. 4 క - ప - లలో, మాత్ర వసు దశమ నవమ, ణామాత్రలు సీస
ముల కెల్ల మల్లియరేచా. మఱియొకపాఠము. మాత్రోక్తి దశమ నవమ,
ణామాత్రలు మాత్రలకు నెల్ల మల్లియరేచా. 5 చ - నలనగసల భరతగణం,
బులు గూడఁగ వానిపాదములు నొక్కెడలన్, గలయ నహంబులు రెండున్,
గలయన్ సీసము బెడంగుగా నిడవలయున్.

* సీసమునం దష్టవిధము లగుమాత్రాగణము లుండు నని యీపద్యము
నుత్తరార్థము భావము.

బులుగా నాలుగు పదములఁ
జెలు వగు నొకగీతితోడ సీసం బమరున్. 12

క. నలనగసలభరతగణం
బులు నొడఁబడి వాని పాదముల నొక్కటి యై
కలయ[1] నహంబులు నట్లన
కలయ నొడంబడి పెనంగుఁగాఁ దమలోనన్. 13

వ. సీసంబు లన్నవి విషమసీసంబులు, సమసీసంబులు నన రెండు
దెఱంగు లయ్యె. అందు,
విషమసీసం బెట్టి దనిన.

[2]ఊహ నేడు గణములుగను నొసర నగణ మొందెఁ ద
త్సాహచర్యమొందె గురుకసహితముగ నొనర్ప ను
త్సాహ మయ్యె నిదియునుం బ్రశస్తముగ నొనర్ప ను
ర్వ్యహితోరుచరిత యాదియ విషమసీస మ్మి చనున్
బ్రాలు వళ్లు లీల నొలిని నిలిపి యా
గణమ కాని యొండుగణము లిడక
యభినుతార్థరచన యభినుతమ్మై యుండఁ
జెప్ప విషమసీస మొప్పుఁ గృతుల. 14

1 ద-గలుగు. 2 ప-లో, ఊహనాఱు నినలగణము లొనరరగణ మొందఁ ద, త్సాహచర్య మాదిగురువుసహితముగ నొనర్పను,త్సాహమయ్యె నిది విసం బ్రశస్తముగ రచింపను. (నాలుగవపాదము సమానము.) గీతము లేదు.

వ. మఱి సమసీసంబు లన్నవి అవకలిసీసంబు, ప్రాససీసంబు, అక్కిలిప్రాససీసంబు, వడిసీసంబు, అక్కిలివడిసీసంబు నా నేనుదెఱుంగు లయ్యె[1]. అందు,—

— అవకలిసీసము. —

పాదంబు నాలుగుపాదముల్గాఁ జేసి[2]
మొదలిమూఁటికి లోకవిదిత మైన
యాలయాఱు[3]గణములు వెలయ (నిర్)మూఁ డిడి
మూనుగాఁ దక్కినవానియందు
నగణముల్ రెం డిడి తగఁ గూడఁ బాదముల్
నాలుగు నిప్పాట నోలి సిలిపి
సమసీసములు చెప్పఁ డమరంగ రెంటికిఁ
బ్రాసముల్ వేఱుగాఁ జేసి యొనర
గీ. సలలితముగ నిట్లు విలసత్పదంబుల
రసికమైనరచన లెసఁగి యుండఁ
గవిజనాశ్రయాంకుఁ డవకలిసీస మి
ప్పాటఁ జెప్పఁ బనిచెఁ[4] దేటపడఁగ[5]. 15

— ప్రాససీసము ; అక్కిలిప్రాససీసము. —

ప్రాసంబు నాలుగుపాదంబులందును
బన్నుగా నిడి పెఱపాదములను

---

1 ద-లో అంకిలి సీస మొక్కటి యధికముగాఁ పేర్కొనఁబడినది. 2 ద-పాదంబులుగఁ జను. 3 చ-డ-ద-నలనామ. 4 ద-దొడఁగె. 5 చ-ప్పాటఁ జెప్పెఁ గృతులఁ దేటపడఁగ.

ప్రాసంబు లిడక తత్పాదంబులం దెల్లఁ
బన్నుగా వళ్లు [1]పరఁగ నిలిపి
దేసి తెనుంగులఁ[2] దియ్యనినొడువులఁ
దెల్లంబుగా నర్థదృష్టి దెలుపు
ప్రాససీసము దీని పశ్చిమార్థంబునఁ
బ్రాసంబు వేఱొక్క ప్రాసమైన
గీ. [3]శ్రీసమేతుఁడైన జినపాద[4]పంకజా-
వాసమధుకరుండు వాసవప్ర[5]
హాసభాసి[6] రేచఁ డనవద్యుఁ డక్కలి[7]
ప్రాససీస మనుచుఁ[8] బరఁగఁ జెప్పె. 16

— వడిసీసము ; అక్కలివడిసీసము. —

వివిధచతుష్షష్టివిద్యల నజుఁ డని
వినుతనయోపాయవిమలబుద్ధి
నమరేంద్రగురుఁ డని యధికతేజంబున
నాదిత్యుఁ డని సుందరాంగయుక్తి
నంగజుఁ డని యీగి నంగాధిరా జని
యలవున నభిమన్యుఁ డని సమస్త
జనులు ముదంబున శ్రావకాభరణాంకు
సత్కవిఁ గవిజనాశ్రయు గుణాఢ్యుఁ

1 చ-పవిలపఱచి. 2 క-చ-దేసి తెనుంగున. 3 ఈగీతము చ-ప్రతిలో లేదు. 4 ద-శ్రీపాద. 5 క-వాసవపర. 6 చ-భాస. 7 ద-రేచనఁ డనుసూచితుం డిట్లు. 8 చ-సీసములను. ద-సీసమరసి.

గీ. బొగడుచుండుదు రని యిట్లు పూర్వరచన
నలరఁ జెప్పిన వడిసీస మయ్యెఁ; దీని
పశ్చిమార్ధంబు వడి యొండు పాట నిలుప
నదియె యక్కిలి[1] వడిసీస మయ్యెఁ గృతుల.[2] 17

వృత్తంబునకు వలె వెలయు నాల్గడుగుల
వెసఁ బ్రాసములు నిల్పి విరతు లునుపఁ
బ్రాససీసం బగుఁ, బశ్చిమార్ధము నట్లు
భాసిల్ల నక్కిలిప్రాససీస
మమరు; మఱి ద్వైరూప్యయతి పాదమం దెల్ల
నడరిన వడిసీస మనఁగఁ బరఁగు,
నర్ధమర్ధమునకు యతులు వేఱైచనఁ
జెప్ప నక్కిలివడిసీస మయ్యె;
గీ. నవకలికి నిట్లు ప్రాసంబు లతిశయిల్లు,
యతులు ప్రాసంబు లిట్లు సంగతుల నడవ
నదియె సమసీస మలరును; దుదను గీతి[3]
వరఁగ విషమసీసం బగు భానుతేజ![4] 18

1 వ-యక్కిలి. 2 వ-గో నీపద్యము పిదప—సీసము రెండుగణంబులఁ, బ్రాసంబె మఱియు నిధివిగానుం బైనన్, భాసిల్లు దీనిఁ గ్రిందను, జేసిననియమములచేత సీసము లగున్. అను పద్యమున్నది. 3 వ-నదియె సమసీస మొత్తానను గీతి 4 వ యమున విషమసీస మింక వినుము త్రిపురుగుణ. ఈపద్యము పిదప, వ..గో ‹‹ఈక్రమానఁ బ్రాససీసము, అక్కిలిప్రాససీసము, వడిసీసము, అక్కిలివడిసీసము, అవకలిసీసము, సమసీసము అనఁగా నారు తెఱంగు లగున్›› ననియుఁ, బిదప ‹‹ఉత్సాహాఖ్యాని లగణము లోనర›› ఇత్యాది పద్యమును గలదు.

— తరువోజ. —

[1]నలనామగణము లినగణంబుతోడ
నాలుగుగాఁ జేసి నాటించి యిట్లు
కలయంగ నెనిమిది గణములై రెండు
గణములతుద యతిగా నిల్పి యమర
వెలయంగఁ బాదముల్ విరచింప వళ్లు
వేర్వేఱ నిప్పాట విదితమైయుండ
సలలితగతిఁ గృతి చనఁ జెప్పఁ డనియె
జానుగాఁ గవిజనాశ్రయుఁడు తర్వోజ. 19

— గీతులు. —

వ. మఱి గీతు లన్నవి విషమగీతులు, సమగీతులు నన రెండు తెఱంగు లయ్యె. [2]అందు విషమగీతులు ఎత్తుగీతి, ప్రగీతి, మేలన[3]గీతి యనం బరఁగె. అందు,

— ఎత్తుగీతి. —

[4]శ్రీదయితాధిపా న
యోదయ నల నన్మత్ర

1 ద-లో "సీ. నలనామషట్క మినగణద్వయంబుతో నాలుగుగాఁ జేసి నాటి యిట్లు। కలయంగ నెనిమిదిగణము లయ్యెను రెండు గణములతుద యతిగాఁగ నమర। వెలయంగఁ బాదముల్ విరచించి వళ్లు వేర్వేఱ నిప్పాటను విదితముగను। సలలితగతిఁ గృతి చనఁ జెప్పఁ డనియెను జానుగాఁ గవిజనాశ్రయుఁడు దనర." ఇది సీసపద్యలక్షణముగాని తర్వోజలక్షణము గాదు. 2 "అందు విషమగీతులు వైతండికంబు లనం బరఁగె" నని కొన్నిప్రతులలో నున్నది. 3 ద-మెలకగీతి. 4 లక్షణ మస్పష్టము. ఒక యింద్రగణము రెండు సూర్యగణములుచేరి యొకపాదమని లక్ష్యము తెలుపుచున్నది. ప్రాసమున్నది.

రయోదిత మైన నెత్తు
గీదియు నొప్పుఁ గృతుల.[1] 20

— ప్రగీతి. —

[2]మూఁడు సేసినగణములు[3] రెండు నలములు
మూఁడినగణములును మొగి నహంబు
పోఁడి గాఁగ నర్ధమున కగుమీఁద ని
[4]ట్లుండఁ జెప్పవలయు నొగిఁ బ్రగీతి. 21

— మేలనగీతి. —

[5]ఒనర నేడ నైన[6]గణము లొప్పఁ బెరసి యుండ
ఘనతరముగ వళ్లు నిట్లు గలసియుండ నిలిపి

---

యతిలేదు. సురనాథుమీఁద సూరు లిరువురు రెంట విరతి, ధరణిః బ్రాసం బు దనరు నెత్తుగీతియందు.—అప్పకవీయము (వావిళ్లవారిప్రతి) ఇందు నాల్గవపాదమున గణభంగ మున్నది. రెండవపాదమందు యతి లేదు.

1 క-గీతి యయ్యెఁ గృతులందు. 2 ఈలక్షణ మాటవెలఁదికిని జెల్లు ను, గాని యందుఁ బ్రాసము లేదు. 2, 4 పాదముల చివర నగణము నుండ వచ్చును. దీనినే యప్పకవి పవడగీతి యని వాడెను 3 సేసి + ఇనగణములు. 4 ప్రాసము విచారణీయము. మూఁడు, పోఁడి శబ్దములు పూర్ణానుస్వారమ ధ్యములుగా గ్రహించినచోఁ బ్రాసము సరిపోవును. 5 క-డ-లలో మాత్ర మున్నది. క-లో 2, 3 పాదములు- ఘనతరంబుగాఁగ నిట్లు గలసియుండ నిలిపి। వినుత మేలగీతి విస్తరంబుగాఁగ (రెండవపాదమం దొకగణము

వినుతమేలనమనుగీతి విస్తరంబుగాఁగ
జననుతుండు చెప్పె వరవిశాలకీర్తియుతుఁడు. 22

— 1 ఆటవెలఁది ; తేటగీతి. —

ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
హంసపంచకంబు నాటవెలఁది;
సూర్యుఁ డొకనిమీఁద సురరాజు లిద్దఱు
దినకరద్వయంబు తేటగీతి. 23

— అక్కరలు. —

క. [2]వినుతద్విత్రిచతుర్గురు
జనితగణంబులు రవీంద్రచంద్రాఖ్యము లై
చను నక్కరజాతుల కె
ల్లను, నాదిను(లఘువు) మొదల లఘు విడనలయుక్.

---

లోపించినది.) డ-1వ పాదము. ఒనర నయినగణము లొప్పఁ జెగసియుండె. (ఒకగణము లోపించినది). 6 ఏడు + అ = ఏడ. ఇనగణములు = ఇనసంబంధగణములు. హగణ మైనఁ జాలు నగణమైనఁ జాలు హగణ। నగణములును రెండు గలసి నాటియంఘ్రి కేడు। తగినవిరతి నాలుగింటఁ దనరఁ బ్రాస మొదవి। మిగుల మెఱయుచుండుఁ గృతులఁ గమలనాఖ్యగీతి. (అప్పకవీయము.) నాల్గవపాదమందు యతిభంగ మగుటచేఁ గవియభిప్రాయము "మేలనాఖ్యగీత" యని యైనఁ గావచ్చును.

1 దీనికి ముందు ద-లో "అందు సమగీతులలక్షణంబు లెఱింగించెద" నని యున్నది. 2 రెండు గురువులతోఁ బ్రస్తరించినచో నాలుగు గణములును, మూఁడుగురువులతోఁ బ్రస్తరించినయెడల నెనిమిదిగణములును, నాలుగు గురువులతోఁ బ్రస్తరించినఁ బదియాఱుగణములును బుట్టును. వీనిలో మొదటి

సమరఁ జేయుచుఁ జంద్రు నే డగుచోట
నదికిన యేఁడుగణములలోనఁ
గ్రమము తప్పక యష్టాటఁ బెద్దయ
క్కర యొప్పఁ గవిజనాశ్రయుఁడు సెప్పె. 25

— మధ్యాక్కరము. —

[1]సురరాజు సురరాజుఁ గూడి
సూర్యుతో నొడఁబడి మఱియుఁ
గరమొప్ప నిష్టాట నాఱు
గణములు మధ్యాక్కరంబు
విరచింపఁ బంపెఁ బ్రావళ్లు
వెలయఁ గవిజనాశ్రయుండు
సురుచిరముగను సుశబ్ద
శోభితం బగునట్లు గాఁగ. 26

— మధురాక్కరము. —

[2]రవి దివిజరాజ [3]గీర్వాణరాజ దేవాధిదేవ
కువలయప్రియు లిష్టాటఁ గూడ నేనుగణములు
నవిరళముగఁ[4] బ్రావడి మధురాక్కరంబు ధరలోనఁ
గవిజనాశ్రయుం డెఱిఁగించెఁ గవుల కింపుజనింప. 27

1 చ-డ-లలో నాల్గవపాదము లేదు. 2 క-చ-డ-ద-లలో నున్నది. 3 ద-రవియు దివిరాజు. 4 ద-నవిరతముగ. గణనియమమున మధ్యాక్కర కన్నడములో దొరె (సమాన) యక్కరమునకును, మధురాక్కర నడువ(మధ్య)ణక్కరమునకును జేరియున్నవి. వానిలక్షణములు. సర

— అంతరాక్కరము. —

[1]ఇన సురేంద్ర చంద్రంబు లిప్పాట వచ్చి
పొనరి యుండంగఁ బ్రావళ్లు పూర్వభంగి
న నగణంబులు నాలుగింటం బెనంగ
ననుపమానాంతరాక్కర మయ్యె శేచ. 28

— అల్పాక్కరము. —

[2]ఇంద్రుండు మఱియొక్కయింద్రుఁ గూడి
చంద్రుతో నొడఁబడి చనిన సత్క[3]
వీంద్రు లల్పాక్కరం బిది యందురు[4]
చంద్రాస్య! కవిజనాశ్రయకవీంద్రా![5] 29

---

సిజోదరగణ మెరడ జనుమల్లినెరెదిక్కె మత్తం। సరసిజోదరగణమెరడ జనుమక్కె గణముమాఱక్కుం। సరసిజలోచనె! దొరెవెత్తగణదిం దొరెవెత్తపెసరిం। దొరెయాగి సుగుదుదు దొరెయక్కర మదనజినుడి తెఱదిం. జలజసంభవగణమక్కె మొదలొళే నడువెమూఱుం। జలరుహోదరగణమక్కె కామాంతకగణమక్కుం। తిలకదంతిరె తలెయొళెబందిక్కె కామబాణా। నళినయపాంగెద్వయ గణమక్కె నడువణక్కరగళె సఖి! (కర్ణాటకచ్ఛందోంబుధి.)

1 ప్రథమపాదమందు యతి విచార్యము. ఇది కన్నడమందు దెడె (అంతరము)యక్కరకుఁ జేరి యున్నది - వనజసంభవగణమక్కె మొదలొళత్తల్। వనరుహోదరగణయుగళమదక్కె రుద్రనదఅంత్యదొళ్ బందిక్కె నాల్కె గణ। వినితె, వనితె! కేళ్ ఎడెయక్కరక్కినుం. (క. ఛం) 2 న- ఇంద్రుఁడు మఱియొక్కయింద్రుతోడఁ। జంద్రుతోఁ గూడఁగాఁ జనుసత్క. 3 ద-చనినసాం గ. 4 ద - బిది యనిరి. 5 ఈలక్షణము కన్నడములో కిఱి (చిన్న)యక్కర లక్షణముం బోలియున్నది. పాడెయలరిర్బరుం మొదలొళిక్కె; జడెయ శంకరనొర్బం తుదియొళిక్కె। మడది! కేళ్ మూ[illegible]మెసెదిక్కె।గడ, కిఱియక్కరక్కెదె లక్షణం. (క. ఛం.)

— ద్విపద. —

ఇంద్రగణములు మూఁడినగణం బొకటి
చంద్రాస్య! ద్విపదకుఁ జనుఁ జెప్ప రేచ![1] 30

— త్రిపద. —

[2]త్రిదశేంద్రు లాఱగు పదియగు నెడనన్
గదియ రెంటను మూఁటను
నదుకుదుఁ ద్రిపదకు నమరు. 31

— చౌపద. —

నలగా భసలను నాల్గిటిలోనన్[3]
వలసిన నాలుగు[4] వడిగాఁ బూనన్
వెలయ గణద్వయవిశ్రమ మైనన్[5]
అలవడుఁ జౌపద కన్వితమైనన్.[6] 32

---

1 ద-కృతుల. 2 ఇది కన్నడలక్షణమును బోలియున్నది. బిసరుహో ద్భవగణం రసదశస్థానదొళ్ । బిసరుహ నేత్రే! గణమె బరుక్కిదవు। బిసరుహ నేత్రే! త్రిపదిగే. (క. ఛం) 3 ద-నలగాభజసల నైదిటిలోనన్. 4 త్రిగణము- అని పాఠాంతరము. 5 చ-డ-లలో వలసిన త్రిగణము వడిహాగణానన్, వెలయ గుణాధ్వనివిశ్రుత మైనన్. 6 ద-చౌపద కాఖ్య యొసంగున్. చౌపదతరువాత ద-ప్రతిలో రగడలు, మంజరి, ఉదాహరణము, గీతము వీనికిలక్షణములు, లక్ష్యములు చెప్పఁబడినవి. ఇవి తఱచుగా విష్ణుపరముగా నుండుటచేఁ బ్రక్షిప్తములుగాఁ నెంచఁదగియున్నవి. ఈపద్యములు షట్పదలక్షణము తరువాత క-ప్రతిలోఁగూడఁ గన్పట్టుచున్నవి. కన్నడచౌపది లక్షణము, మదనన తందెయముం । దొదవిద శంకరనొళ్ । పుదిదిరిసందుదునో । డిగు, సతి! చౌపదిగే. (క. ఛం).

— 1షట్పదము. —

2త్రిదశేంద్రగణములు వెలయ (నిర్) మూఁడిడి
కదియ నంత్యంబునఁ జంద్రుఁ గూర్చి
3తుది యిట్లుగా మదిఁ జె(ప్పినదియ) ష
ట్పద మగు మల్లియ రేచ(నాఖ్య). 33

గద్యము. 4ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవిజనాశ్రయం బనుఛందంబునందు జాత్యధికారము.

---

1 కొందఱు లాక్షణికులు షట్పదపాదమునకుఁ ద్విప్రాసము విధించిరి. యతి యెుందును లేదు. 2 చ-డ-లలో మాత్ర మున్నది. కన్నడములో నాలువిధముల షట్పదములున్నవి. వాని సామాన్యలక్షణము. లో ఱువమాత్రె యషట్పది। గాతాఱడిగొగెసఱ్ఱిల్లి యుంటే నియమం। మూఱుకొంౘిందు తదర్థం। బేటేశం కడెగొ శెల్లగా తెఱనకుౘం. 3 తుది యిట్లుగా మదిఁ జెప్పుట యయిను షట్పద యగు మల్లియ రేచన వినవే. (అని మాతృక) 4 డ - లో మాత్ర మున్నది.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము

## షట్ప్రత్యయాధికారము.

---

క. శ్రీనారీప్రియకరుఁ డఖి
లానందకరుఁడు[1] కవిజనాశ్రయుఁడు ధరి
త్రీనుతుఁడు సమస్తకళా
నూనుఁడు షట్ప్రత్యయంబు లొగి నెఱిఁగించున్.[2] 1

క. క్రమమునఁ బ్రస్తారము న
ష్టము నుద్దిష్టమును వృత్తసంఖ్య యనంగా
నమరు లగక్రియ యన న
ధ్వము నన షట్ప్రత్యయములు తనరుఁ గృతులన్. 2

క. ఇడి గురువుక్రింద లఘు వ
క్కడ సదృశము సేసి పిఱుఁదఁ గదిసినగురువుం
దిడఁ బ్రస్తారము; రెం డిడి
మడుప నగును వృత్తసంఖ్య మల్లియరేచా! 3

---

1 ద–శ్రీనారీప్రియుఁ డఖిలజనానందకరుండు. 2 ద–[illegible]
జెప్పున్. ద–ప్రతి యింతటితో సరి.

క. [1]ధరవృత్తసంఖ్యలో సవ
మురుముం జేసినను గూడు మొన్కడ లఘువుల్[2]
గురువులు సమవిషయంబులు
విరచింపఁగఁ జెడినయట్టివృత్తము వచ్చున్. 4

క. [3]ఒక్కటి మొద లిడి మడుపుచు
నక్కడఁ దుదదాఁక లఘువులందలిలెక్కల్
లెక్కించి కూడఁ బదపడి
యొక్కటి మఱి యందుఁ గూడ నుద్దిష్ట మగున్. 5

క. తరతరమ దొంతివృత్తా
క్షరములు లెక్కాదికంబుగా నిల్పి యధో౽
క్షరము లుపర్యక్షరములు
పరువడిఁ గూడుచు నుపాంతపర్యంతముగాన్. 6

క. కలయు నుపాంతాధో౽క్షర
ము లుపాంతములందు నిల్పి మునుగూడిన నొ
క్క లగక్రియ (తత్పిండిత)
మలవడ సద్వృత్తసంఖ్య మల్లియ రేచా![4] 7

---

1 క-వృత్తసంఖ్యార్థమున్ దుదివిషమమైన । గురువు లిడుచును నొక్కటి గూర్చి మఱియు । దళముచేయుచు సమసంఖ్య దగఁగ లఘువు । పనర నిడినను నష్టవృత్తంబు వచ్చు. 2 ఈపాదము సమన్వయముగా లేదు. 3 డ-లో నున్నది. క-ఆది రెండిడిమడుపుచు నలగ గురువు । లున్ననొక్కటి దరపుచు నన్ని యక్క, రముల నీరీతిమడుపంగఁ గ్రమముతోడఁ, దెలిసి సుకవులు దీని నుద్దిష్ట మండ్రు. 4 క-లో "నొక్కలగక్రియ" యనుసంత నఱకు మాత్రమే యున్నది.

క. అగు నర్ధ మేకరహిత
ద్విగుణితసంఖ్యాంగుళీకృతివ్యాపక మి
ద్ధగుణాఢ్య! కవిజనాశ్రయ!
జగజ్జనాధార! ధీర! చారుచరిత్రా! 8

[1] గద్యము. ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహామధుకరాయమాన శ్రావకాభరణాంకవిరచితం బైనకవిజనాశ్రయం బను ఛందంబునందు షట్ప్రిత్యయాధికారము.

---

1 మూలములో లేదు.

శ్రీరస్తు.

# కవిజనాశ్రయము

## [1] దోషాధికారము.

---

క. శ్రీశ్రితవక్షుఁడు విద్యా
శ్రీశ్రితముఖుఁ డఖిలజనవిశేషితకీర్తి
శ్రీశ్రితభువనుఁడు సుకవిజ
నాశ్రయుఁ డెఱిఁగించుఁ గృతుల నగుదోషంబుల్. 1

క. [2] గోపితపునరుక్తి వ్య
ర్థాపార్థ విసంధి సంశయ చ్ఛందోభం
గాపక్రమ యతిభంగ వి
రూపోక్త్యపశబ్దములు విరోధము కృతులన్. 2

---

1 క-చ-డ-లలో నున్నది. ఈయధికారము ఛందశ్శాస్త్రమునకు సంబంధించినది కాక పోయినను, ప్రక్షిప్త మనుటకుఁ దగిన యితరకారణములు కనఁబడకుంటచే నీగ్రంథములోని భాగముగా గ్రహింపఁబడినది.

2 చూ. 1 యతిభంగ మర్థశూన్యం। సతతవిరుద్ధార్థ ముక్తపునరుక్తార్థం। చ్యుతయథాసంఖ్యం వ్యవహితమచ్ఛాదం విసంధికం నేయార్థం. 2 ఆగమసమయన్యాయవి। భాగకళాకాలలోకదేశవిరుద్ధం। భోగివిషం బోల్ప్రాపా। త్యాగమనాగినుగు మనఃశకృతివిగను గినితుం. (కర్ణాటకవిరాజమార్గము.)

క. అని యిట్లు దశవిధము లగు
మునిమతమునఁ గావ్యదోషములు; వాని నెఱుం
గనివాఁ డెప్పాట నెఱుం
గు నుదాత్తకృతిప్రసంగగుణదోషములన్. 3

క. మును సెప్పినశబ్దమె చె
ప్పనేని కొఱ లేక శబ్దపునరుక్తి యగున్;
మును చెప్పినయర్థమె చె
ప్పనేని కొఱ లేక యర్థపునరుక్తి యగున్. 4

క. దినకరుఁ డని మఱి దినకరుఁ
డనఁగా శబ్దపునరుక్తి యనఁ జనుఁ గృతులన్;
దినకరుఁ డని యాదిత్యుం
డనఁగా నర్థపునరుక్తి యనిరి కవీంద్రుల్. 5

క. [1]అయనయసమేత! కమనీ
యయశా! పునరుక్తి యయ్యె నమరుఁ బదావృ
త్తియు మఱి వీప్సాభీక్ష్ణ
క్రియాసమభిహార మైనక్రియలన్ గృతులన్. 6

క. విను వసతి వసతి దప్పక
వన మనఁగా వీప్స, వచ్చి వచ్చి చనుం దా

(1) చూ:-దూరాభీక్ష్ణవీప్సో| దారానుకృతిక్రియాసమభిహారంసమా | హారతరచాపళాదిగె| సారం బుధరిం పదక్కె యుగళోచ్చరణం.(కర్ణాటకశబ్దమణిదర్పణము)

ననఁగను నభీక్ష్ణ, మి మ్మి
ష్మనఁగాఁ గృతులఁ గ్రియాసమభిహార మగుఁ. 7

క. తనసత్యము తనశౌచము
తనశౌర్యము తనవిశిష్టదానము చతురా
ననునకుఁ బొగడఁగ మిక్కిలి
యని యాక్రియఁ జెప్పినది పదావృత్తి యగుఁ. 8

క. మొదలిక్రియతోఁ నమర్చక
విదితవిరుద్ధార్థయుక్తి విపరీతం బై
తుదఁ గ్రియరాఁ జెప్పిన వ్య
ర్థదోష మని రఖిలకావ్యతత్త్వవిధిజ్ఞుల్. 9

క. [1]పొడిచి యొడువంగఁ బగఱను
గడుఁ గరుణాపరుఁడ వీవు కావున నీ క
గ్గెడువారు లేరు పగ ఱె
క్కడ నని యిప్పాటఁ జెప్పఁగా వ్యర్థ మగుఁ.. 10

క. దినకరుఁడును హిమకరుఁడును
మనసిజుఁడును బోల్ప నీసమానులు సత్కాం
తి నుదాత్తతేజమున సొబ
గున ననిన నపక్రమం బగుఁ వ్యుత్క్రమ మై. 11

1 చూ: అరినృపబలమంగెల్దర్ । పరాక్రమక్రమదె శౌర్యమం ప్రకటిసునీం । నరమహితా నినగే నహి । తరు మొళగే సతత పరహితాచారపరా. (కవిరాజమార్గము.)

క. వినుతచ్ఛందంబునఁ జె
ప్పినయెడ నిలుపక కడలను దప్పి నిలుచుచో
ప్పునఁ జెప్పిన నది యతిభం
గనామదోష మగుఁ గృతి జగజ్జనవినుతా! 12

క. వెలయంగ లక్ష్యలక్షణ
ముల సిద్ధము లైనశబ్దములు గాని కుసం
ధులు మొదలైనవి గావో
క్తు లెల్ల నపశబ్దనామదోషము లయ్యెన్. 13

క. పరఁగ నికారోపరిత
[1] త్స్వరమ యికారంబుతోడ సదృశముగా నె
వ్వరియి ల్లిది యి ట్లన కె
వ్వరి ది ల్లి ట్లనఁ గుసంధివర్గం బయ్యెన్. 14

క. స్వరగణము కూడి కృతిఁ ద
త్స్వర మైనన కార మొంది ప్రామై[2] చనఁగా
[3] దోర వీవు నజుఁడు నవకయ
దోర వీవు న్నజుఁడు ననిన దుస్సంధి యగున్. 15

క. తనకడకు వలచి యేఁ బో
[4] యిన నొల్లం డొల్లఁ డింక నే నాతనిఁ గా

---

1 క–త్స్వరమయికారంబుతో ధ్రువం బమరఁగ నె. 2 క–ప్రాప్తై. 3 క–దోర యీవునుజుం డనకయా, దోర యీవునుజుండు అనిన దుస్సంధి యగున్. 4 క–యిననొల్లానఁ డొల్లఁ డింక.

మిని! గనయు నేమి నోఁచితి
నన విరహిణి కమరు నీక్రియల్[1] వ్యర్థంబై.    16

క. వన మిదియె కంటె తోడ్పడు
మన వన మని యొండు రెండు మడుఁగులు గాఁ జె
ప్ప నపార్థదోష మగు; నది
చను మత్తోన్మత్త బాలచరితములందున్.[2]    17

క. తలరమి నీతో మేరువు
అలవి యగుం గాక యొరులు అలవి యె వర ఉ
జ్జ్వలతేజ యనఁగ సాధిం
గలయునినోడువులు విసంధికము లనఁ బరఁగున్.    18

క. ప్రియమున నే నిన్ను మనః
ప్రియుపాలికిఁ బుచ్చఁ బోయి బింబాధర! పా
డియె. యిట్లు చేయ నని సం
శయార్థముగఁ జెప్పఁ గృతుల సంశయ మయ్యెన్.    19

క. భూభాగనభోభాగది
శాభాగప్రవర్తికీర్తి సత్కృతికృతిచ్ఛం
దోభంగ మిట్లుగా ఛం
దోభంగం బనుప్రధానదోషం బయ్యెన్.    20

---

1 క–నీక్రియలు. 2 చూ. స్థిర మర్థశూన్య మెంబుదు, దురుక్తమిద నింతు పేళ్దొడెల్లంపీనం, మరుళుం మదిరాపరవశ, శరీరమం పేళ్గు మణిప నాఎం పేళ్గుం. (కవిరాజమార్గము.)

క. [1]నొడువులకు సంధి నెగ్గులు
[2]పొడమిన శ్రుతి దుష్ట మయ్యె; భూతలమున ని
చ్చెడు నెడ నినుమడి సిరి యనఁ,
[3]బడు నీజో డనినఁ జుట్టుప్రా వగుఁ గృతులన్[4]. 21

క. తుద వేఱు సేసి మఱి చ
క్కఁదనపుఁ దెనుఁగున నమర్చి కల వంబుజముల్
పదియు ననక కల వంబుజ
పది యని కృతిఁ జెప్ప వైరిపద మనఁ బరఁగున్.[5] 22

క. [6]వెలయఁగఁ [7](జెఱకు) విలు గొని
[8]యలరమ్ములు చేతఁ బట్టి యంగజుఁడు విరా
హుల నేయు నేర్పు కడమిన్
దోల మెలయఁగ ననినఁ గాకుదోషం బయ్యెన్. 23

1 చ-నుడువు లగు సంధి నెగ్గులు. 2 క-పొడమిన నతిదుష్ట మగుచు. 3 చ-బడునిచ్చోటులను. 4 ఈపద్యముతరువాత చ-లో, ఇందు కుదాహరణము. అవనిపుండు పుట్టె నమరకుజము భంగి, బాధులు గురులు నమల బాదిఁ దలఁప, నిచ్చు నష్టసుతుల నితనికి శ్రీవాసు, డేనుఁ డనినఁ జుట్టుప్రాసకృతుల- అని యున్నది. 5 చ-వైరివర్గం బరయన్. వైరిపదమనకుఁ గన్నడమున దరిసమాసమని పేరు. "పదవిధిళన్నడకంస,కన్నడక్రమిల్లాద్యరి దె సందునప జెది, ర్పుదు బిరుదావళియో ళ్పే,ళ్వుదు పెఱువఱో భాగదిదు విరుద్ధసమాసం." (శబ్దమణిదర్పణము.) 6 డ-వెలసినచెఱకువిలుఁగొని, యలవడఁ ద్రిప్పుచును వచ్చె నంగజుఁడును విరహుల నేయ ననినఁ గలిమిన్, దొల మొలయఁగ ననినఁ గాకుదోషములయ్యెన్. 7 మూలములో జిగురాకని యున్నది గాని యది పొరపాటు. 8 క-యాలమరు ద్రిప్పుచును వచ్చి యంగజుఁడు విరా, హుల నేయు నమలికలమని, దొలమిగులఁగననినఁ గాకుదోషం బయ్యెన్.

క. ఈతఁడు "నృపస్య నగరం
యాతి" యనం జనిన సుప్తిఙంతంబులు, "కృ
త్వా తీర్త్వా జిత్వా" యన
భ్రాంతిగ నిక్రియలు చొరవు [1]భాషాకృతులన్. 24

క. వితతసుకవివాక్యం బవ
గతమై 'కవయో వదంతి కావ్యం' బని స
త్కృతి నిక్రియఁ బెట్టించిన
నతిశయమై యుండు సుప్తిఙంతం బయ్యున్. 25

క. ఇవి మొదలగునొడువు లనే
కవిధగ్రామ్యోక్తు లెన్ని కల వన్నియు స
త్కవు లపశబ్దము లని త
త్కవితల మెచ్చరు కవీంద్రకల్పమహీజా! 26

క. శ్రీదేవీపతి రేచఁడు
గాదిలియై చనఁగ దేశకాలకళాలో
కాదివిరోధస్థితుల స
మాదరమునఁ దెలియఁ జెప్పె నఖిలజనులకున్. 27

క. కలహంసలు క్రొమ్మామిడి
తలిరులలోఁ గోకిలాళి తామరవిరిపు
వ్వులలో నాడెడు ననుచు
క్తులు దేశవిరోధనామదోషము లయ్యెన్. 28

1 ఇచ్చట భాష యనఁగా సంస్కృతముకంటె భిన్న మయినదేశ భాష. ఈశబ్ద మీయర్థమం దుత్తరదేశమందు వ్యవహరింపఁబడుచున్నది.

క. ¹చినికెంపుం బురినెమిళులు ముద
మున నాడెడు నింద్రగోపములు పాఱెడు నా
మనికాల మయ్యె నిలలో²
ననఁ గాలవిరోధదోష మనిరి కవీంద్రుల్. 29

క. అసమగజము లందలములు³
కొసమాత్రకు దెచ్చు నట్టిగుఱ్ఱంబుల నం
కుస మిడక యెక్కు ననఁగా
హాసనీయకళావిరోధ మనిరి కవీంద్రుల్. 30

క. విను కరహీనుఁడు తగ వ్రా
సినపత్త్రము తెచ్చి యొక్క చెవిటి వినఁగ బో
రనఁ జదివె మూఁగ సభలో
నన లోకవిరోధదోష మనిరి కవీంద్రుల్. 31

క. ⁴ఘనదండకాష్ఠకృష్ణా
జినములు సొగయింప నొక్కజినముని చను దెం
చె ననఁగ సమయవిరోధం
బని కవులకుఁ జెప్పఁ గవిజనాశ్రయుఁ డొనరన్. 32

---

1 చ–చినికెడుభువి. 2 డ–మనికాలమయ్యెఁ బో మిన్నట్టన. 3 చ–అసమగజంబుల దవ్వల. డ–అసమగజంబులు పూన్పలు. 4 చ–లో లేదు. చూ–అమరఁగఁ బులితోలును మ, స్తమునం బలుజడలు దాల్చి సొగసుం డొప్పెన్, హిమకరశేఖరుగుడి నన, సమయవిరుద్ధార్థమగుచుఁ జను సత్కృతులన్. (కావ్యాలంకారచూడామణి)

క. [1]జననుతధర్మ మహింసయ
యనుమతమున వితతముగ గజాసురుఁ బాపం
బని చంపఁ డయ్యె నీశ్వరుఁ
డన నిది యాగమవిరోధ మనిరి కవీంద్రుల్. 33

క. అని యిట్టివి దశదోషము
లనఁ జనుఁ గృతి నివియ వెండి యతిశయతరమై[2]
చనుఁ గొన్ని యెడల ధీరుల
మన మలరఁగఁ జెప్పికేని మల్లియ రేచా! 34

క. జయదేవాదిచ్ఛందో
నయమున సంక్షేపరూపునం జెలువుగ మ
ల్లియ రేచన సుకవిజనా
శ్రయుఁ డీఛందంబుఁ జెప్పె జనులకుఁ [3]దెలియన్. 35

[4]గద్యము ఇది వాదీంద్రచూడామణిచరణసరసీరుహమధుకరాయమాన కవిజనాశ్రయశ్రావకాభరణాంక [5]విరచితం బైన కవిజనాశ్రయచ్ఛందంబునందు దోషాధికారము.[6]

---

1 చ-లో లేదు. 2 చ-అనునిదశవిధదోషము, లనఁ గృతులం దివియ వెండి యతిశయకరమై. 3 క-నొనరన్. 4 డ-లో లేదు. దీనికిఁబూర్వము చ-లో నీక్రిందిపద్య మున్నది. సకలమహీజనంబులకుసంతసమయ్యెడు సౌఖ్యసంపదల్, సకలధరాధినాథులు నిజస్థితి దప్పక భూమి నేలఁగా, సకలకవీశ్వరుల్ పొగడఁ జంద్రుఁడు సూర్యుఁడు గల్గునంతకున్, సకలధరిత్రిలో వెలసె ఛందము తద్ద వెలుంగుచుండెడున్. 5 చ-శ్రావకాభరణ. 6 సమస్తాధికార మని పాఠాంతరము.

# * ప్రక్షిప్తపద్యములు.

క. [1]శ్రీవల్లభు యతిగణసం
సే(వితపా)దారవిందుఁ జింతితఫలదున్
భావజగురు నలఘుచ్ఛం
దోవినుతు మురారి భక్తితో వినుతింతున్.

పక్షి-చ్ఛందంబునందు :—

మనోరమావృత్తము.
నరజగంబులన్ మనోరమన్
బరఁగు పద్యతిం బఠింప నౌ. 1

మణిరంగవృత్తము.
సప్రసాదరసాగము లొందున్
దీప్రబాణయతిన్ మణిరంగన్. 2

పంచకమలావృత్తము.
పంచకమలాఖ్యన్ భయసల్గం
బంచితముగా పద్యతిఁ జెందున్. 3

---

* 25 వ పద్యము క-లో నున్నది. 14 వ పద్యము చ-లో నున్నది. తక్కినవన్నియు బ-లో నున్నవి. 1 ఈపద్యము విష్ణుపరముగా నుండుట చేతను గొంచెము మార్పుతో ఛందోదర్పణములో నుండుటచేతను బ్రక్షిప్తము. 1 మొదలు 26 పద్యములలో యతిస్థానము చెప్పఁబడినది. ఈగ్రంథమున్న లక్రిందఁ బుస్తకములోని పద్యములలో యతిస్థానములు చెప్పఁబడలేదు. చెప్పకుండుటయే కవిమత మైనట్లు తోఁచుచున్నది. కావున నివి ప్రక్షిప్తములు. 27 వ పద్యములో శివసంబోధన నుండుటచేఁ బ్రక్షిప్తము. 28 వ పద్యము, అనంతునిఛందస్సులోని పద్యమునం దుత్తరార్థ మగుటచేఁ బ్రక్షిప్తము.

త్రిష్టుప్ఛందంబునందు :—

ఉపజాతివృత్తము.

ఈరెండువజ్రంబులు నిందుఁ గూడన్
సరోజనేత్రా! యుపజాతి యయ్యెన్. 4

మందారదామవృత్తము.

ఆఱింట విశ్రాంతి నై తాతగాస్వా
ధారంబు మందారదామంబు రుద్రా! 5

సుముఖవృత్తము.

నజజవముల్ శరవిశ్రమమున్
సుజననుతా! సుముఖం బెసఁగున్. 6

జగతీఛందంబునందు :—

పుటవృత్తము.

నగయుతయతితో నాతయుతం బై
యగణము తగ ఫాలాక్ష! పుటం బౌ. 7

చంద్రవర్త్మవృత్తము.

చంద్రవర్త్మ మగు సామజయతితోఁ
జంద్రజూట! రనభంబు సగణమున్. 8

కుసుమవిచిత్రవృత్తము.

కుసుమవిచిత్రం గాను నయయుగ్మం
బసదృశషడ్యత్యభిహిత మైనన్. 9

ఉజ్జ్వలవృత్తము.

స్మయరుచి తలషడ్యతి నుజ్జ్వలా
హ్వాయము ననభరావళిఁ జెందినన్. 10

అతిజగతీఛందమునందు :—

ప్రీతివృత్తము.

సగణత్రయముఁ జగసంయుతంబుగా
నెగడు న్నిధివిశ్రమనీతిఁ బ్రీతికిన్. 11

సుమంగలీవృత్తము.

సజసంబుతో సగము సంగతితోఁ సా
మజవిశ్రమంబున సుమంగలి యయ్యెన్. 12

క్షమావృత్తము.

ననతతగములన్ నవ్యభూభృద్యతిన్
వినుతమయి క్షమావృత్త మొప్పు న్మహిన్. 13

శక్వరీఛందమునందు :—

జలంధరవృత్తము.

వాలిభకారముచున్ భభజవంబులతో
లాలితకీర్తి! దిశాయతి జలంధర యౌ. 14

లోలావృత్తము.

భూతేశా! మసమంబుల్ పొందంగా భగగంబుల్
స్వాతంత్ర్యక్షితిభృద్విశ్రామం బొందును లోలన్. 15

కమలవిలసితవృత్తము.

కమలవిలసితము కలయతితోడన్
గ్రమమున నననగగములు గూడన్. 16

అతిశక్వరీఛందమునందు :—

మాలినీవృత్తము.

ననమయయయుతంబు న్నాగవిశ్రాంతమై యి
ట్లనుపమ మగుమాలిన్యాహ్వయం బయ్యె ధాత్రిన్. 17

మణిగణనికరవృత్తము.

మనులఘుగురుకము మణిగణనికరం
బనఁ జను నెనిమిది యగునెడ యతిగాన్. 18

[1] శాంతివృత్తము.

ఒందుగా రజద్వయంబు లొప్పు రేఫతో జనా
నందకారి శాంతి యయ్యె నాగవిశ్రమంబుతో. 19

సుకేసరవృత్తము.

వారినిభమూర్తి! సత్కవిజనాశ్రయా! సుకే
సర మగు దిగ్యతి న్నజభజంబు రేఫతో. 20

మనోజ్ఞవృత్తము.

నజజభరప్రకరంబున న్నిధివిశ్రమం
బజితమనోజ్ఞ మగున్ నయం బొనగూడఁగాన్. 21

మాలతీవృత్తము.

కరటివిరతి నారకాంత యాయుక్తితోడన్
మరిగి తిరిగి చెప్ప మాలతీవృత్త మయ్యెన్. 22

ప్రభద్రకవృత్తము.

రజనిచరాన్వవాయహర! రామ! రాఘవా!
నజభజరల్ ప్రభద్రకము నవ్యదిగ్యతిన్. 23

1 అప్పకవీయములో దీనికే సుగంధి యని పే రున్నది.

చంద్రరేఖావృత్తము.

సారంబై చంద్రరేఖన్ జంచన్మరేఫల్ మయాసం
చారంబుం జొది పొందున్ సప్తోదయద్విశ్రమం బై. 24

హంసయానావృత్తము.

ఆనతారిశేఖ ! హంసయానకొప్పుఁ గుంజర
స్థానవిశ్రమంబుగా రజద్వయంబు రేఫతో. 25

ఆకృతిచ్ఛందమందు :—

విచికిలస్తబకవృత్తము.

శబరవికృతిధర ! పురహర ! సవిత్యవిరతి విచికిల
స్తబకమున నిరువదిలఘువులు చన లగ మొఁబెనఁగున్.[1]

వికృతిచ్ఛందంబునందు :—

పద్మనాభవృత్తము.

ఎన్నంగ నీతం డనాద్యంతుఁ డంచున్ బ
రీక్షింతు రెవ్వాని వాఁ డెల్లనాఁడున్
సన్నేలు నా సర్వవిశ్రామ మై పద్మ
నాభం బగున్ సప్తతంబుల్ గగంబుల్. 27

మత్తాక్రీడితవృత్తము.

మత్తాక్రీడితం బగు వృత్తం బౌఁ ద్రినవయతి
మమమనననసనవముల్.[2] 28

---

1 ద్వితీయపాదమందు యతి చెడినది. 2 యతి చెడినది. మత్తాక్రీడాఖ్యం బెంపాద స్మమతననననవమహిత మగుచు ర,తాష్టత్రిబహ్మిప్రా తు ల్లక్రీడై (అప్పకవీయము).

# కవిజనాశ్రయము.

## గ్రంథానుక్రమణిక.

---


| | పుట. |
|---|---|
| **అ** | |
| అంతరాక్కరము | 73 |
| అంత్యప్రాసము | 25-26 |
| అంబుజవృత్తము | 32 |
| అంబురుహావృత్తము | 47 |
| అక్కిలిప్రాససీసము | 65-66 |
| అక్కిలివడిసీసము | 66-67 |
| అఖండయతులు | 20 |
| అజితప్రతాపవృత్తము | 56 |
| అతిజగతి | 29-40 |
| అతిశక్వరి | 29-42 |
| అతిధృతి | 29-45 |
| అతివినయము | 45 |
| అత్యష్టి | 29-44 |
| అత్యుక్త | 29-30 |
| అనుప్రాసము | 25 |
| అనుష్టుప్పు | 29-34 |
| అభికృతి | 29-50 |
| అలసగతివృత్తము | 42 |
| అల్పాక్కరము | 73 |
| అవకలిసీసము | 65 |
| అశ్వలలితవృత్తము | 49 |
| అష్టి | 29-43 |
| అసంబాధవృత్తము | 42 |
| **ఆ** | |
| ఆకృతి | 29-48 |
| ఆర్య | 61 |
| ఆటవెలది | 70 |
| **ఇ** | |
| ఇంద్రవంశవృత్తము | 38 |
| ఇంద్రవజ్రావృత్తము | 37 |
| ఇనగణములు | 7 |

| | పుట. |
|---|---|
| **ఉ** | |
| ఉక్త | 29 |
| ఉత్తమచరితుఁడు | 14 |
| ఉత్పలమాలావృత్తము | 47 |
| ఉత్కృతి | 29-51 |
| ఉత్సుకవృత్తము | 35 |
| ఉద్గీతి | 62 |
| ఉపగీతి | 62 |
| ఉపేంద్రవజ్రావృత్తము | 37 |
| ఉష్ణిక్కు | 29-33 |
| **ఎ** | |
| ఎక్కటివడి | 22 |
| ఎత్తుగీతి | 68 |
| **క** | |
| కందము | 60-61 |
| కన్యావృత్తము | 31 |
| కమలాధీశుఁడు (రేచన) | 22 |
| కరిబృంహితవృత్తము | 48 |
| కవిజనాశ్రయము (గద్యము) | 2-27 |
| కవిజనాశ్రయుఁడు | 2-19-43 |
| కవిరాజవిరాజితము | 49 |
| కవీంద్రజనాశ్రయుఁడు | 44 |
| కవీంద్రాభరణీయమానుఁడు | 41 |
| కాంతావృత్తము | 37 |
| కుమారలలితవృత్తము | 33 |
| కుసుమితలతావేల్లితము | 45 |
| కృతి | 29-46 |
| కోమలీవృత్తము | 56 |
| క్రౌంచపదవృత్తము | 50 |
| **ఖ** | |
| ఖచరప్లుతవృత్తము | 47 |
| **గ** | |
| గద్యలక్షణము | 4 |
| గాయత్రి | 29-3 |
| గీతి | 62 |
| గురు—లక్షణము | 5 |
| గురువు—ఉదాహరణము | 5 |
| గురువు—రూపము | 5 |
| **చ** | |
| చంద్రకళావృత్తము | 46 |
| చంద్రగణములు | 7 |
| చంద్రశ్రీవృత్తము | 43 |
| చంద్రికావృత్తము | 37 |
| చంపకమాలావృత్తము | 47 |
| చిత్రపదవృత్తము | 34 |
| చౌపద | 74 |
| **ఛ** | |
| ఛందోనామములు | 29 |

| | పుట. |
|---|---|
| **జ** | |
| జగతి | 29-38 |
| జలదరవవృత్తము | 51 |
| జలదవృత్తము | 41 |
| జలధరమాలావృత్తము | 39 |
| జలోద్ధతగతివృత్తము | 39 |
| జాతులు—లక్షణము | 4 |
| జినమతహితుఁడు (రేచన) | 37 |
| **త** | |
| తనుమధ్యావృత్తము | 32 |
| తరలవృత్తము | 46 |
| తరువోజ | 68 |
| తురగవృత్తము | 49 |
| తేటగీతి | 70 |
| తోటకవృత్తము | 38 |
| తోదకవృత్తము | 39 |
| తోధకవృత్తము | 38 |
| త్వరితపదగతి | 45 |
| త్రిపద | 74 |
| త్రిప్రాసములు | 25 |
| త్రిభంగివృత్తము | 53 |
| త్రిష్టుప్పు | 29-36 |
| **ద** | |
| దండకలక్షణము | 54 |
| ద్విపద | 74 |

| | పుట |
|---|---|
| ద్విప్రాసము | 24 |
| దుష్కరప్రాసము | 24 |
| ద్రుతవిలంబితవృత్తము | 38 |
| **ధ** | |
| ధృతి | 29-45 |
| **న** | |
| నర్కుటవృత్తము | 44 |
| నారీప్లుతవృత్తము | 55 |
| నారీవృత్తము | 30 |
| **ప** | |
| పంక్తి | 29-36 |
| పంచచామరము | 43 |
| పణవవృత్తము | 36 |
| పద్యము-లక్షణము | 4 |
| పద్యము—విభాగము | 4 |
| పద్మవృత్తము | 43 |
| పరస్థానార్ధసమవృత్తములు | 56 |
| పరాజితవృత్తము | 41 |
| పాలాశదళవృత్తము | 44 |
| పృథ్వీవృత్తము | 45 |
| పోలికవడి | 22 |
| ప్రకృతి | 29-47 |
| ప్రగీతి | 69 |
| ప్రగుణవృత్తము | 32 |

| | పుట. |
|---|---|
| ప్రతిష్ఠ | 29–31 |
| ప్రభాకలితవృత్తము | 47 |
| ప్రభావృత్తము | 41 |
| ప్రమాణీవృత్తము | 34 |
| ప్రమితాక్షరావృత్తము | 39 |
| ప్రహరణకలితవృత్తము | 41 |
| ప్రహర్షిణీవృత్తము | 40 |
| ప్రాదియతులు | 20 |
| ప్రాసభేదములు | 24 |
| ప్రాసలక్షణము | 18 |
| ప్రాససీసము | 65–66 |
| ప్రాసాక్షరమైత్రి | 26 |
| ప్రియంవదావృత్తము | 39 |
| ప్రియకాంతావృత్తము | 43 |
| ప్లుతయతి | 21 |
| **బ** | |
| బంధురవృత్తము | 50 |
| బిందుయతులు | 21 |
| బింబవృత్తము | 31 |
| బృహతి | 29-34 |
| **భ** | |
| భద్రకవృత్తము | 35 |
| భాస్కరవిలసితవృత్తము | 51 |
| భీమతనూజుఁడు | 25 |
| భుజంగప్రయాతవృత్తము | 38 |

| | పుట. |
|---|---|
| భుజంగవిజృంభితవృత్తము | 51 |
| భుజగశిశురుతవృత్తము | 34 |
| భూతిలకవృత్తము | 46 |
| భూనుతవృత్తము | 42 |
| **మ** | |
| మంగళమహశ్రీవృత్తము | 52 |
| మంజుభాషిణీవృత్తము | 40 |
| మందాక్రాంతావృత్తము | 44 |
| మణిభూషణశ్రీవృత్తము | 42 |
| మణిమాలావృత్తము | 48 |
| మణివిభ్రాజకాంతివృత్తము | 57 |
| మత్తమయూరవృత్తము | 40 |
| మత్తావృత్తము | 36 |
| మత్తేభవిక్రీడితవృత్తము | 46 |
| మదనదర్పవృత్తము | 48 |
| మదనవిలసితవృత్తము | 33 |
| మదరేఖావృత్తము | 33 |
| మధ్య (ఛందస్సు) | 29–30 |
| మధ్యాక్కరము | 72 |
| మనుష్యగణములు | 10 |
| మనోహరవృత్తము | 57 |
| మయూరసారివృత్తము | 36 |
| మరుద్గణంబులు | 10 |
| మల్లియరేచన | 2–5–6–8–15–25 |
| మహాక్కరము | 71 |
| మహాస్రగ్ధరావృత్తము | 48 |

| | పుట. |
|---|---|
| మాణవకవృత్తము | 34 |
| మానినీవృత్తము | 49 |
| మృగీవృత్తము | 30 |
| మేఘవిస్ఫూర్జితవృత్తము | 46 |
| మేదినీవృత్తము | 43 |
| మేలనగీతి | 69 |
| **య** | |
| యతినియమము | 35 |
| యతిభేదములు | 19 |
| **ర** | |
| రతిప్రియవృత్తము | 56 |
| రథోద్ధతవృత్తము | 37 |
| రాక్షసగణములు | 10 |
| రుక్మవతీవృత్తము | 36 |
| రుచిరవృత్తము | 40 |
| రేచన | 8-23-25-33-37-38-41-44 |
| **ల** | |
| లయగ్రాహి | 53 |
| లయవిభాతి | 53 |
| లయహారి | 53 |
| లాటీవిటవృత్తము | 48 |
| **వ** | |
| వంశస్థవృత్తము | 38 |
| వడిసీసము | 66-67 |
| వడిపర్యాయపదములు | 18 |
| ,, స్వరూపము | 18 |
| వనమంజరీవృత్తము | 48 |
| వనమయూరవృత్తము | 41 |
| వర్గయతులు | 20 |
| వసంతతిలకవృత్తము | 41 |
| వసుమతీవృత్తము | 33 |
| వాగ్వధూవల్లభుఁడు (రేచన) | 39 |
| వాతోర్మీవృత్తము | 38 |
| వాదీంద్రచూడామణి | 27-58-75 78-87 |
| వారశ్రీవల్లభుఁడు (రేచన) | 38 |
| వాసవగణములు | 7 |
| వికృతి | 29-49 |
| విచిత్రవృత్తము | 32 |
| విద్యున్మాలావృత్తము | 34 |
| వినయవృత్తము | 30 |
| విభూతివృత్తము | 33 |
| విశ్వదేవీవృత్తము | 40 |
| విషమసీసము | 64 |
| వృత్తసామాన్యలక్షణము | 4 |
| **శ** | |
| శక్వరి | 29-41 |
| శార్దూలవిక్రీడితవృత్తము | 45 |
| శాలినీవృత్తము | 36 |
| శుద్ధవరాటీవృత్తము | 36 |

| | పుట. |
|---|---|
| శుభికావృత్తము | 46 |
| శ్యేనీవృత్తము | 37 |
| శ్రావకాభరణాంకుఁడు | 27–45 |
| శ్రావకాభరణుఁడు | 42 |
| శ్రీనివాసుఁడు (రేచన) | 42 |
| శ్రీ పెంపువృత్తము | 30 |
| శ్రీవృత్తము | 29 |
| **ష** | |
| షట్పదము | 75 |
| **స** | |
| సంకృతి | 29–50 |
| సంయుక్తాక్షరయతి | 22 |
| సమవృత్తలక్షణము | 28 |
| సమానీవృత్తము | 34 |
| సరసయతి | 23 |
| సరసిజవృత్తము | 50 |
| సింహరేఖావృత్తము | 34 |

| | పుట |
|---|---|
| సీసపద్యసామాన్యలక్షణము | 63–6 |
| సుందరవృత్తము | 4 |
| సుందరీవృత్తము | 3 |
| సుకరప్రాసము | 2 |
| సుకాంతివృత్తము | 3 |
| సుగంధివృత్తము | 4 |
| సుప్రతిష్ఠ | 29–3 |
| సుభద్రకవృత్తము | 4 |
| సురలతావృత్తము | 3 |
| సురుచిరవృత్తము | , |
| స్రగ్ధరావృత్తము | 4 |
| స్రగ్విణీవృత్తము | 3 |
| స్వరయతులు | 1 |
| స్వస్థానార్ధసమవృత్తములు | 5 |
| స్వాగతవృత్తము | 3 |
| **హ** | |
| హారిణీవృత్తము | 4 |
| హాలముఖీవృత్తము | 3 |